# నన్నెచోడుని కవితా వైభవం

శీలావీ.

నిడదవోలు
వెంకటరావు



# నన్నెచోడుని కవితా వైభవము

(నన్నెచోడుని పద్యాలకు రుచిర వ్యాఖ్యానము)

వ్యా ఖ్యా త :

నిడదవోలు వేంకటరావు

ప్రచురణ



రిజిష్టర్డ్ నం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికింద్రాబాదు-3

NANNECHODUNI KAVITHA VAIBHAVAMU
*Selections from poetic works-with a Commentary by:*
Nidadavolu Venkata Rao


**యువభారతి**

ప్రచురణ : 47

ప్రథమ ముద్రణ ప్రతులు : 2, 200

తేది. 21 - 11 - 1976

*ముఖచిత్ర రచన :*

శీలా వీర్రాజు

*ముద్రణ :*

లలితా ప్రెస్

ఖైరతాబాదు, హైదరాబాదు-500 004.

*ముఖచిత్ర ముద్రణ :*

టెక్నో ప్రింటర్స్, హైదరాబాదు.

*ప్రతులకు :*

**యువభారతి**

5. కింగ్స్‌వే, సికింద్రాబాద్-500 003.

లేదా

యువభారతి కార్యాలయము

ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు

*తిలక్ రోడ్, హైదరాబాదు-500 001*

**వెల: రు. 2-00**

---

PAPER USED FOR THE PRINTING OF THESE BOOKS
WAS MADE AVAILABLE BY THE GOVERNMENT OF INDIA
AT CONCESSIONAL RATES

YUVABHARATHI IS GRATEFUL




# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమాణాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పన్నెండేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటే ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 46 ప్రచురణలను ప్రచురించి రెండు లక్షల యాభై వేలకుపైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు పాఠకులకు అందించడానికి పూనుకొంది.

యువభారతి సాహితీమిత్ర పథకంలో దాదాపు 3,700 మందికి పైగా సాహితీమిత్రులు చేరారు. రానున్న ఉగాది నాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో ఐదువందల మందికి పైగా భారతీ మిత్రులుగా, యాభై మంది భారతీభూషణులుగా చేరారు. ఏ ఒక్క పథకంలోనైనా సభ్యులుగా చేరి మా "నందిని" మాసపత్రికను ఉచితంగా పొందే అవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. "నందిని"లో యువభారతి కార్యకలాపాల వివరాలేకాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశాలుంటాయి.

మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయన శీలతా సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు.

21-11-1976

# మా మాట




ఆంధ్ర సాహిత్యంలో పురాణేతిహాసాలు వెలువడుతున్న రోజులలో వర్ణనాప్రధానమైన ఆలంకారిక రచనకు అంకురార్పణచేసి కావ్యమార్గాన్ని రసకుసుమోపేతంగా తీర్చిదిద్దినవాడు నన్నెచోడ దేవుడు. ఇతడు ప్రభువు. ఐనా రాజ్య రచనతో తృప్తిపడక శాశ్వతమైన కావ్య రచనకు పూనుకొని రాజుల కాలం పోయినా కవిగా తెలుగుల హృదయాల్లో నేటికీ [illegible]చేసికొని కూర్చున్నాడు. ఆయన 'కుమార సంభవము' ఏ సంస్కృత గ్రంథానికీ అనువాదం కాదు. తమిళ కన్నడ సంస్కృత కావ్యాల్లోని [illegible]వలీలలను ఇతడు జాను తెనుగులో అవతరింప జేశాడు. అలంకారాల ద్వారా ఊహా లోకాలను సృష్టించ గల శక్తి నన్నెచోడున కున్నంతగా మరో తెలుగు కవికి లేదేమో అనిపిస్తుంది. కావ్యాన్ని చదువుతూ ఉంటే నన్నెచోడుని కవితలోని కొన్ని వన్నెలవన్నెలను చూపాలని ఆచార్య నిడదవోలు వేంకటరావుగారిని యువభారతి అభ్యర్థించింది. వారు ఈ పుస్తకాన్ని మాకు ప్రసాదించారు. తెలుగు వాళ్ళకు నన్నెచోడున్ని క్రొత్త కోణంతో చూపించారు.

ఆచార్య వేంకటరావు గారిని ఎరుగని తెలుగువాడుండడు. పరిశోధన పరమేశ్వరులు వారు. కవులూ మృదుల హృదయులూ. వెయ్యేళ్ల తెలుగుసాహిత్య సాగరాన్ని పుడిసిట బట్టినఅగస్త్యులు. ఆయన నడుస్తుంటే ఆంధ్రవాఙ్మయమంతా నడుస్తున్నదేమో అని పిస్తుంది. తెలుగు, తమిళ, కన్నడ ఇంగ్లీషు, సంస్కృత భాషలతో తలస్పర్శి పరిచయ మున్న మనీషి వతంసులు, మా అభ్యర్థనను వారంగీకరించుట మా భాగ్య విశేషం.

నన్నెచోడుని కవితా వైభవాన్ని ఆంధ్రావళికి అందించే అవకాశాన్ని మాకిచ్చిన ఆచార్యులవారి ఔదార్యానికీ భాషాభిమానానికీ మా భక్తి పూర్వకాభి వాదములు.

ఇరివెంటి కృష్ణమూర్తి

21-1-1976

అధ్యక్షుడు.

# నన్నెచోడదేవ కవి

"వన్నెలఁ జిన్నెలన్ గమనవైఖరియున్ రసపుష్టిభావముల్
ప్రన్నని జానుతెన్గును నుబల్కుల నవ్యకళాభిరామముగా
మున్నెతెలుంగువాణిని నమోఘముగాఁ గయి సేసినట్టి న
న్నన్నియ చోడదేవకవితావిభవంబును నెన్న శక్యమే?"

నేటి కరువదియాతేండ్లనుండి ఆంధ్ర సారస్వత ప్రపంచము నతివేలముగా నాకర్షించిన కుమారసంభవమను కావ్యము రచించినకవి నన్నెచోడదేవుడు. ఇతడు తెలుగు చోడరాజు. సూర్యవంశీయుడు. కాశ్యపగోత్రుడు తండ్రి చోడబల్లి పాకనాటిని పరిపాలించిన రాజు. తల్లి శ్రీపతి ఈమె చంద్రవంశీయు డైన హైహయరాజు పుత్రిక—తన పూర్వులలో కరికాల చోడని ఇతడు పేర్కొన్నాడు_అతనికి తమిళదేశమునన్న ఒరయూరు రాజధాని

నన్నె చోడకవి తాను ఒరయూరున కధిపతి యని చెప్పుకొన్నాడు. కాని ఈ ఒరయూరు తమిళదేశమందలిది కాదు. అది కన్నడ దేశమున—కన్నడ తెలుగు సరిహద్దులలో నున్నది. కావున యీతడు దాక్షిణాత్యకవి _ కుమార సంభవమేకాక, కళా విలాసమను మఱియొక కృతిని రచించెనని లక్షణ గ్రంథములవలన తెలియుచున్నది. తన పూర్వులు తమిళదేశమువారు. తన తండ్రి తెలుగుదేశమున పాకనాటిని పరిపాలించినాడు. తాను కన్నడ—తెలుగు సరిహద్దులలో నున్నాడు. ఈ సంఘటనవలన అతడు తన కుమార సంభవమున తమిళ, కన్నడ దేశభాషా సాంప్రదాయములను తొలిసారిగా తెలుగు కావ్యము లలో నెలకొల్పినాడు.

టెంకణాదిత్యుడని వివేక బ్రహ్మయని ప్రసిద్ధివహించిన నన్నెచోడకవి. క్రీ.శ. 1160 ప్రాంతముల నున్నవాడు.

ఈతని గురువు జంగమ మల్లికార్జునుడు. అతడు శ్రీశైల నివాసి; వేదవేదాంగవేత్త; శివాగమ పారగుడు; సకల కళాస్వరూప వాణీధరుడు, సాక్షాత్తు శివాపరావతారమగు నీగురువునకు తన కుమార సంభవము నంకితము చేసినాడు.

నన్నె చోడనికి తన గురువే ఇష్టదైవము అతడే తనకు పతి _ స్వామి _ జంగమ మల్లయ యని యీతనికి మఱియొక పేరు ఈ జంగమ శబ్ద మాకాలమున కన్నడ దేశమున బసవన ప్రచారములోనికి తెచ్చిన వీరశైవులకు మాత్రమే చెల్లుచుండెడిది - కాని జంగములలో బ్రాహ్మణులుందరు. నన్నెచోడడు తన గురువును 'భూసురకులజు'దని బ్రహ్మవంశజుడని వర్ణించుటచే నాకాలమున వీరశైవులగు బ్రాహ్మణులును నుండెడివారని మనము తెలుసుకొన గలము_వీరశైవులగు నీ బ్రాహ్మణులు వేద మార్గానుసారులు, శివుడు తప్ప వీరికి వేఱుదైవములేదు. శివపారమ్యవాది యగు తన గురువునకు కృతినిచ్చుచు నన్నెచోడడు గురుని, శివుని ఏకమూర్తిగా అభేదవ్యవసాయము చేసి తన కావ్యమునకు శివమయత్వము దివ్యత్వము నాపాదించినాడు.

## కుమార సంభవము

శివోత్కర్షను ప్రధానముగా నిరూపించు నీ కావ్యమునకు సంస్కృతమున ప్రసిద్ధమగు కాళిదాసకవి కుమారసంభవము మూలము. కాళిదాస కృతియేగాక సంస్కృతమున ఉద్భటుడు అని మఱియొక కవి రచించిన కుమార సంభవము (96 శ్లోకములు గలది) కూడ నన్నెచోడకవి యనుసరించినాడు.

పార్వతీ జననము మొదలు కుమారస్వామి తారకాసురుని జయించు వఱకును గల సంస్కృత కుమార సంభవ కథకు తెలుగున నన్నెచోడకవి 1. గణాధిప జననము 2. దక్షాధ్వరధ్వంసము అను మఱి రెండుకథలను ప్రారంభముననే చేర్చినాడు - కాళిదాసు మూలమున - పార్వతీ పరమేశ్వరులు త్రిమూర్తులలో గిరిజాశంకరులవలె సాక్షాత్కరింతురు. కాని నన్నెచోడని కుమార సంభవము నందట్లుగాదు. వారు జగదాదిమ మూర్తులు - శివశక్తిస్వరూపులు వారు సతీశివులు. వారే జగత్ సృష్టికర్తలుగా ప్రత్యక్షమగు చుందురు - ఇట్టి శివదైవ ప్రాధాన్యము కొఱకే నన్నెచోడడు పై రెండుకథలను నాదిని చేర్చినాడు.

## నన్నెచోడడు ప్రబంధ సృష్టికర్త

తెలుగు సాహిత్యమున నన్నయ కావ్యసంప్రదాయమునకు ఆదికవిగా నన్నెచోడకవి ప్రబంధకవితకు ప్రథమాచార్యుడు. కుమారసంభవము తొమ్మిది రసములతో, పది కావ్యగుణములతో పదునెనిమిది (అష్టాదశ) వర్ణనలతో ముప్పది యాఱలంకారములతో సర్వలక్షణమై విరాజిల్లుచున్నది- ఇష్టదేవతాస్తుతి కావ్య ప్రశంస - సుకవిస్తుతి-కుకవినింద-షష్ఠ్యంతములు—ఆశ్వాసాద్యంత పద్యములు-ఆశ్వాసాంతగద్య-అను ప్రబంధ రచనా ప్రాణాళిక నేర్పరచిన కవినన్నెచోడుడే - ఇంకను మఱికొన్ని క్రొత్తవానిని ప్రవేశపెట్టినాడు.

## కావ్య విశేషములు

1. కావ్యము 'శ్రీ'తో ప్రారంభించి, మంగళ మహా శ్రీవృత్తముతో ముగించుట-
2. ఇష్టదేవతా స్తుతిలో—మన్మథస్తుతి-
3. ఆశ్వాసాద్యంతములు. సంబోధనాంతములు లేకుండ విభక్త్యంతములుగా జేయుట-
4. కృతిపతికి, కృతి కథానాయకునికి అభేదవ్యవసాయ మొనరించుట-
5. సంస్కృత కావ్యములనుండి సందర్భానుసారముగా శ్లోకముల నను వదించుట-
6. తమిళ కన్నడ భాషా సాహిత్య సంప్రదాయములు ప్రవేశపెట్టుట.
7. తెలుగు భాషా వ్యాకరణ ఛందస్సులయందు అలంకారములయందు ప్రత్యేకత పాటించుట.

8. శాస్త్రీయ విజ్ఞానము సంతరించి సర్వజ్ఞత్వము ప్రకటించుట.
9. చిత్రబంధ కవితను తొలిసారిగా వెలయించుట.
10. దేశీయములైన పలుకుబడిని - జాతీయములను - సామెతలను వాడి, దేశీయాచారములను వర్ణించి కావ్యమున - ఆంధ్రతాముద్ర (తెలుగు దనము) ప్రదర్శించుట.
11. మార్గ-దేశి-జాను తెనుగు వస్తుకవితాసంప్రదాయములను తెలుపుట నన్నెచోడుని ప్రతిభ వైదుష్యము—

నన్నెచోడని కవితా ప్రతిభ అసాధారణము: అనను కరణీయము అతడు కవిరాజు- "భాషా విశేషములతో ఆయా ఘట్టములయందు- ఆయా రసముల నావిష్కరించునపుడు సర్వస్వతంత్రుడైన కవిరాజు"- నన్నె చోడడు కవిరాజేకాదు అతడు కవిరాజ శిఖామణి"

రాజకవుల అద్యుడగుటచే రాజకవి శిఖామణి-

'కవి క్రాంతదర్శి' అనునది- ఈతనియందు సార్ధకము. నన్నెచోడకవి కవిత అత్యంత భావరామణీయకమైనది. కళావిలాసమున మన్మధుని వర్ణించుచు-

"అతని ఇలుసొచ్చి వెడలని యతఁడుగలఁడె"

అనునది — నన్నెచోడని మనోహరవ్యంగ్యభావ రచనకు మచ్చుతునక.

సంస్కృత సాహిత్యమున నన్నెచోడని వైదుష్యము సంస్తవనీయము- కుమార సంభవమున వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు (కావ్యమూలము)ఉద్భటుడు (కావ్యమూలము) బాణుడు-భారవి మాఘుడు. భవభూతి - త్రివిక్రముడు - అను కవులనుండి యను సరణములు గలవు — దండి, దశకుమార చరిత్ర - కావాదర్శము వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి యీతడు పరిశీలించి యనుసరించినాడు. అద్వైతాచార్యుడై శివస్తుతులను రచించిన- శంకరాచార్యుని సౌందర్యలహరినుండిమహిమ్న స్తవ రచయితపుష్పదంతునినుండి భావములు గ్రహించినాడు.

గజ శాస్త్రము — ధనుశ్శాస్త్రము - సంగీతము — చిత్రకళ వీనియందీతనికి విశిష్ట ప్రజ్ఞగలదు.

సంస్కృత కవులనేగాక మన పొరుగుననున్న కన్నడ కవియగు పంప మహాకవి భారతమును అనుసరించినాడు-

## తెలుగు సాహిత్యము నన్నెచోడని ప్రభావము

తెలుగు సాహిత్యమున కుమార సంభవ మతవరించినది మొదలు—కవుల కనుసరణీయమైనది.

### పాల్కురికి సోమనాథుడు

శివకవియగుచే పాల్కురికి సోమనాథుడు గేయమగుద్విపదకు కావ్యకళాప్రౌఢి గల్పించుట కాధారము నన్నెచోడని కృతియే.

## కేతన

కేతన దశకుమార చరిత్రమున నన్నెచోడు ననుసరించి ఇష్టదేవతాస్తుతిలో మన్మథస్తుతి చేసినాడు—ఆశ్వాసాద్యంతముల యందు విభక్త్యంతములు పాటించినాడు కుమార సంభవమువలె తన కృతిని పంచ్రెండాశ్వాసములు రచించినాడు—

## తిక్కన

తిక్కన కవులందఱికన్న నన్నెచోడని హెచ్చుగా ననుసరించిన కవి తిక్కన. ఉత్తర రామాయణమున, నాతని ననుసరించి మనుమసిద్ధికి, శ్రీరామునికి అభేదవ్యవసాయము చేసినాడు, ఆశ్వాసాద్యంతములు విభక్త్యంతములుగా చేసినాడు— అప్పటికి నన్నయ భారతమున సంబోధనలే యున్నవి కాని తిక్కన దానిని పాటింపలేదు— నన్నెచోడునే అనుసరించినాడు. అతని కవితా పద్ధతిని విమర్శించినాడు.

తిక్కన భారతమున యుద్ధవర్ణనలో అనేక ఘట్టములలో నన్నెచోడుని పదబంధములు భావములే కాననగును—

నన్నెచోడడు హరునికి శివునికి తన కావ్యము నంకితము చేయగా తిక్కన హరి హరనాథునికి తన భారతము నంకితము చేసినాడు—

## మంచెన

మంచెన కేయూర బాహుచరిత్రమున నన్నెచోడని యనుసరణములుగలవు—

## కొరవి గోపరాజు

సింహాసన ద్వాత్రింశకలో కొరవి గోపరాజు నన్నెచోడుని యనుసరించినాడు — నన్నెచోడకవి మొదటిసారిగా తెలిపిన అరువదినాలుగు విద్యలు (—చతుష్షష్టికళలు)— వివరములు నీతడిచ్చియున్నాడు—

## కృష్ణరాయలు

ఆముక్త మాల్యదయందు నన్నెచోడని యను సరణములున్నవి.

## వెన్నెలకంటి వెంకటాచలకవి. క్రీ. శ. 1750

ఈతడు నన్నెచోడనియను కరించిన చివరకవి.

నన్నెచోడడు సింహాసనము నధిష్ఠించి రాజ్యము నేలెనేమో తెలియదు కాని, కావ్యసింహాసనము నధిష్ఠించి కవితా సామ్రాజ్యమేలిన మాట తథ్యము ఆతడు కవి సార్వభౌముడేకాదు రాజకవి సార్వభౌముడు. అతని కృతి ఆంధ్ర సరస్వతికి మణికిరీటము.

నిడదవోలు వేంకటరావు

# నన్నెచోడ కవితా వైభవము

క. తన జనకుఁడగు స్థాణువు
జనని యపర్ణాఖ్య దావిశాఖుండనఁగాఁ
దనరియు నభి మతఫలముల
జనులకు దయనొసగు చుండు షణ్ముఖుఁ గొలుతున్ (1-8)

ఇది కుమారస్వామి వర్ణన- అతడు పార్వతీపరమేశ్వరుల కుమారుడు.

తనతండ్రి శివుడు. స్థాణువు - మ్రోడు - తనతల్లి పార్వతి అపర్ణ- ఆకులులేనిది - తాను విశాఖుడు - కొమ్మలు లేనివాడు. అయినను - అతడు కోరిన ఫలముల నిచ్చును-

ఫలము నిచ్చుటకు చెట్టుమ్రోడుగా గాక - ఆకులు - కొమ్మలు గలిగి యుండ వలెను - పై పద్యమున అట్టి వృక్ష స్వభావమునకు విరుద్ధముగా నున్నను - ఆ వృక్షము ఫలముల నిచ్చుట విశేషము.

శబ్దశ్లేషమూలమున - శివ పార్వతులకు, కుమారస్వామికి గల సహజ నామములిచ్చుట చమత్కరింపబడినవి -

వృక్షపరముగా స్థాణువు అనగా మ్రోడు కాని దేవతాపరముగా ప్రళయ కాల మందైన చలింపక నిలుచువాడు అని అర్థము - అట్లే అపర్ణ - ఆకులు లేనిది అని అర్థమైనను దేవతా పరముగా ఆకులనైనను తినక తపస్సుచేసిన పార్వతి అని అర్థము. ఆరీతిగానే - విశాఖుడు అనగా కొమ్మలు లేనివాడైనను విశాఖా నక్షత్రమందు జన్మించిన వాడగుటచే, విశాఖుడని దేవతా పరమైనది.

విశాఖుడు అనే శబ్దమునకు ఇంకను మఱి మూడర్థములున్నవి.

1. విశాఖమనగా-నెమలి అది వాహనముగా గలవాడు - మయూర వాహనుడు.
2. విశాఖుడనగా పెక్కు చేతులు గలవాడు ఆతనికి పన్నెండు చేతులు.
3. విశాఖుడనగా వేదశాఖలు తెలిసినవాడు - కళా నిష్ణాతుడు.

విశాఖునకు - స్కందుడు అని మఱియొక నామముకలదు - ఆతని గూర్చిన యీ పద్యము కందముగా నుండుటలో విశేషమున్నది - కుమార

స్వామికి స్కందుడను పేరున్నది. పార్వతీ నందన స్కందస్సేనానీరగ్ని భూర్గుహః' (అమరము) స్కంద శబ్ద భవము కందము - స్కందము ప్రాకృత ఛందో భేదము

పై పద్యమునకు మూల మీక్రింది శ్లోకములలో గన్పట్టుచున్నది.

"కాచిల్లతాతరుః కశ్చిత్ప్రితి కాయాం సదద్భుతమ్
అపర్ణాతు సఃస్థాణుః దదాతేకాంక్షితం ఫలమ్:
"లతాప్యేకాతరుశ్చైకః కాశ్యామాశ్చర్య దంపతీ
సాచాపర్ణాస చస్థాణుః దదాతే వాంఛితం ఫలమ్:

ఈ శ్లోకముల యాకరము లన్వేషణీయములు-

ఆ. అన్యదైవ వితతి నర్చించి కొలుపుతా
డిడి ఫలంబు గొనుట: పడయఁగనెడి
సద్య మిష్టఫలదు జంగమ మల్లికా
ర్జునుని కొలుపు మొసరు మునుఁగఁగొనుట. (1-12)

ఇతర దైవములను కొలిచి కోరిన ఫలము పొందుట తాటిచెట్టు నాటి వేసిన తరువాత అనుభ వించుట వంటిది. జంగమ మల్లికార్జునుని కొలిచి కోరిన వానిని పొందుట సిద్ధముగా పెరుగు అన్నము తినుట వంటిది అని పద్యార్థము.

ఇతర దైవములను కొలిచిన - ఫలము పొందుటకు - చాలా కాలము పట్టును.

జంగమ మల్లికార్జునుని కొలిచిన, వెంటనే ఫలము పొందవచ్చును - అని తాత్పర్యము.

తాడిడి ఫలము గొనుట - తాడి అనగా తాటిచెట్టు తాటి చెట్టు నాటిన - ముప్పయి ఏండ్లకు గాని - పండ్లులభింపవు అంత - దీర్ఘకాలము మనము నిరీక్షింప వలెను.

మొసరు మునుగ గొనుట - మొసరు అన్నది కన్నడ పదము - పెరుగు అని అర్థము.

పెరుగుతో నిండిన అన్నము. అప్పుడే భుజింప వచ్చును.

మల్లికార్జునుని కొలిచిన వెంటనే ఫలము లభించును.

ఏదైన ఒక పని గావించి దాని ఫలితము కొరకు దీర్ఘకాలము వేచి యుండుటకు తాడిడి పండు తిన్నక్రియ అనునది జాతీయముగా పరిణమించినది దీనిని నన్నె చోడు డే తొలుతవాడినాడు. ఆవెనుక తక్కిన కవులను సరించిరి.

"తాదిదిపండు తిన్నక్రియ తద్దయు కాలముగోరు - చుండఁగా.

(కేయూరబాహు చరిత్ర - 3-28.)

ముత్తాటిపండు తినుట - అనగా - మూడు తాటిచెట్లునాటి పండ్లు తినుట చాలా కాలము జీవించుట. అను నర్థమున ప్రయుక్తము-తొంబదేండ్ల వయస్సు.

గీ. భర్తతో గూడ ముత్తాటి పండు దినియె.
యెత్తె మున్మన్మ గుఙ్జిల నెందరేని.

పాండురంగ మాహాత్మ్యము -( 4-26)

చ. పరగ సువర్ణ బంధ మృదుభావము గల్గియు లోనఁజూడఁగా
బొరపగు చిత్రరూపమును బోలె నసత్కవి కావ్యమిమ్మహిన్
బరుగు సువర్ణ బంధమృదు భావ విశేషములోన వెల్పలన్
సరియగు రత్నపుత్రికయు సత్కవి కావ్యము నొక్కరూపమై (1-38)

మంచి వర్ణములు (రంగులు) గలిగి మనోహరమైనను అసత్కవి (కవి కాని వాడు) కావ్యము చిత్రపటము నందలి చిత్రరువువలె, వెలుపలి భాగము మాత్రమే ఆకర్షణీయమై యుండును, గానిసత్కవిర చించిన కావ్యమట్లుగాక రమణీయమైన వర్ణములచే - బంగారుచే పొదుగ బడిన రత్నపుత్రిక వలె వెలుపల లోపల నొకేరీతిగా ఆకర్షణీయ మగును-ఇచట వర్ణశబ్దమున శ్లేష గలదు

చిత్రపట చిత్రరువుబాహ్యమగు నేత్రానందము మాత్రమే గలిగించును.

రత్నపుత్రిక బాహ్యమగు నేత్రానందముగానేగాక - ఆంత రంగీకమైన మానసికానందము గలిగించును -

ఈ పద్యమున కావ్యశిల్పము నిరూపితమైనది. విగ్రహము నిర్మించుటకు శిల్పమెట్లావశ్యకమో కావ్యమును నిర్మించుటకు శిల్పమావశ్యకము -

కర్మయొక్క కళశిల్పము-
"శిల్పం కర్మకళాదికమ్"

"శీర్యతే అభ్యస్యత ఇతి శిల్పం - శీల ఉపధారణే - ఉపధారణ మభ్యాసః అభ్యసింపబడునది - వాత్స్యాయనుడు చెప్పిన సృత్త

గీతాది చతుష్షష్టి (64) కావ్య క్రియలును — ఆలింగనాది చతు
ష్షష్ట్యాభ్యంతర క్రియలు కళలన బడును
అట్టికళలును స్వర్ణకారాది క్రియలు శిల్పమన బడును

(అమర కోశము)

చతుష్షష్టి కళలు - బాహ్యములు - అభ్యంతరములు అని రెండు విధములు అందు కవితా కళ బాహ్యమునకు సంబంధించినది. అది శిల్పము మూలముననే వ్యక్తమగును. రత్నపుత్రికా నిర్మాణము స్వర్ణకార క్రియ. అది శిల్పకళ కావుననే నన్నె చోడకవి కావ్యమునకు రత్నపుత్రికా సామ్యము నిరూపించినాడు.

శిల్పశబ్దము వాడకయే తాను కావ్యశిల్పమున నైపుణ్యము గలవాడని పై పద్యమున ధ్వనింప జేసినాడు.

నన్నెచోడకవి ననుసరించి యే

తిక్కన తన ఉత్తర రామాయణమున ప్రస్తావించినాడు.

"అమలోదాత్తమనీషమైను భయ కావ్య ప్రౌఢి పాటించు
శిల్పమునం బారగుఁడన్ గలావిదుఁడ"

(నిర్వ. 1-9)

తిక్కన యిందు శిల్ప శబ్దముతోపాటు 'కళా' శబ్దము వాడుటచే కళా శిల్పములకు గల అవినా భావ సంబంధ మిందు సూచితము వీనితో మనీష— ప్రౌఢి అనురెండు విశేషము లిందుగలవు. మనీష యనగా కవిరచనా శక్తి ప్రతిభ — ప్రౌఢి అనగా రసమయత్వ సిద్ధిగలుగజేయు నైపుణ్యము. ఈ రెండును గూడినగాని కావ్యశిల్పమున పారగత్వము సంఘటిల్లదని తిక్కన నిరూపణ—

మంచన కేయూరబాహు చరిత్రమున 'శిల్ప' ప్రసక్తి యున్నది.

"స్థాయి రసము శృంగారం
బై యలవడఁగథలు నీతులైయెడనెడరా
గేయూర బాహు చరితను
సేయుము నీవాంధ్ర కావ్యశిల్పము మెఱయన్ 1-11

క. చతురోక్తుల నుత పదబహు
గతుల నలంకార భావకాంతి రసార్థో

న్నతిఁగృతి నతిరసికులు వర
సతిగతి నెఱిఁగింప వలదె సౌభాగ్యమునన్ (1–39)

నేర్పుగల మాటల చేతను పొగడ దగిన నడకచేతను, అలంకారములు ధరించి, రస భావములచే మనస్సును చూఱగొనెడిసతి భార్యవలెకృతి, రసికుల నలరించును—ఇందు ఉక్తులు పలుకులు పదగతి. పద్యముల గమనము. అలంకారములు నగలు భావము కాంతి రసము అర్థము అనునవి కృతికి సతికి సమానములే—సతిమూలమున నెట్టి రసానందము గలుగునో కృతిమూలమున నట్టి రసానందము గలుగును గావున కృతి సతిగా నిరూపితమైనది.

తెలుగు కావ్య సంప్రదాయమున — నొక నూతన మార్గము ద్రొక్కిన తొలి కవి నన్నెచోడుడే-

కావ్యము సరస్వతి స్వరూపము - కవి సృష్టికర్త కావున — బ్రహ్మ స్వరూపుడు — శబ్దార్థముల సమ్మేళనమే కావ్యము - బ్రహ్మ శబ్దము — సరస్వతి అర్థము .

ఈ రెండు అవినాభావ సంబంధములు అట్లే-కవి-కృతియు నవినాభావ సంబంధము గలవి.

పై వివేచన ననుసరించిన నన్నెచోడ కవి కృతిని సతితో పోల్చినాడు-సతివలె కృతియు స్త్రీ లింగము. ఈ సందర్భముననే కవి - దీనిని యిట్లు సమర్థించినాడు.

"అనురక్తయైన,
భాషాంగన దక్కనేలిన మహత్త్వము లోకమునం బ్రసిద్ధిగా (1-48.)

భాషాంగన నా కనురక్త. ఆమెనాకు వశవర్తిని - అందువలన నీ ప్రబంధమును నిర్మించెదను"—

భాషాంగన యనగా సరస్వతి -

కృతి సతి యను సంప్రదాయము ననుసరించియే పిల్లలమఱ్ఱిపిన వీరన-జైమినీ భారత రచనా సందర్భమున

" వా ణి నా రా ణి "

అని రాజసభలో ప్రకటించినట్లు మనమూహింప వచ్చును.

నన్నెచోడ కవి ననుసరించి ప్రౌఢకవి మల్లన తన రుక్మాంగద చరిత్ర మున–కావ్యమును వరసతితో గాకుండ వారసతి -వేశ్యతో నిట్లు పోల్చినాడు.

శా. సౌరభ్యంబును బంధచాతురి తగన్ శయ్యాచమత్కారశృం
గారంబున్ వివిధార్థముల్ సరస సాంగత్యంబు నానాకళా
పారీణత్వము మంజువాగ్విభమున్ పాంచాల రీతిన్ దగన్
వారస్త్రీయును బోలె నొప్పవలదా వర్ణింపఁగావ్యం బిలన్ (1–24.)

వారసతి వలన గలుగునది ఐహికానందము—
వరసతి వలన గలుగునది ఆముష్మికానందము—

కావ్యము కాంతా సమ్మితము – అని ఆలంకారిక సూక్తి నన్నెచోడ కవి దృష్టిలో

కావ్యాంగన – ఇహపర సాధకము
కులాంగన ఇహపర సాధకము

"అహరహ రైధమాన శుభమన్వయ వృద్ధికి సాధు బుద్ధికిన్
విహితము ప్రేమ భావనకు విశ్రుత కీర్తికి మన్కి పట్టునై
ఇహపర సాధకంబగు కులేందుముఖీ సుఖమెంత వానికిన్
బహుతర పూర్వ పుణ్యపరి పాకమునన్ ఫలియించు నెంచగన్"
(సత్యభామా సాంత్వనము)

మ. హృదయాహ్లాదముతోడఁ బాయక సదా నైకప్రకారంబులన్
మదనాసక్తిఁ బెనంగుచున్న విలసన్మత్తేభ విక్రీడితం
బది దాక్షాయణి సూచి కౌతుకరతైకా లీన భావాభిలా
షదృగత్యుజ్జ్వల దీధితుల్ నెఱపెనీ శానాన నాబ్జంబుపైన్ (1–101).

పార్వతీ పరమేశ్వరులు గజవనమున విహరించు చుండిరి. ఆ సమయ మున – అచ్చట గజ క్రీడను పార్వతి చూచినది. అట్లు చూచినపుడామెకు–గజ రూపములతో క్రీడింపవలెనను సంకల్పము కలిగి తన యభిలాషను తన చూపు లచే, శివునికి వ్యక్త పరచినది.

ఈ పద్యమున నొక విశేషము గలదు. అది ముద్రాలంకారము.

ముద్రాలంకారమనగా, వృత్తముపేరు, కథా సందర్భము ననుసరించి, పద్యము నందిముద్చుట – పై పద్యము మత్తేభ విక్రీడితము. మత్తేభవి క్రీడి

తము అను నీ వృత్తముపేరు. చక్కగా - మత్తేభములు క్రీడించు పట్టున ఉప యుక్తమైనది.

ఈ ముద్రాలంకారమును కావ్యమున ప్రవేశ పెట్టిన మొదటికవి నన్నె చోడుడే - ఇందీయలంకారము 5 పట్టుల కలదు.

1. వనవర్ణనలో మత్తకోకిల వర్ణన - మత్తకోకిల వృత్తము. 4-108
2. వటురూప శివునకు స్వాగతము - స్వాగత వృత్తము. 7-5
3. మానిని - పార్వతి వర్ణన - మానినీ వృత్తము. 7-9
4. క్రౌంచ పక్షుల గమనము - క్రౌంచపద వృత్తము. 10-30
4. మంగళ మహా శ్రీ చెప్పుట - మంగళ మహాశ్రీ వృత్తము. 12 - 230

తిక్కనాది కవులేగాక, ప్రబంధ కవులు కొందఱు నన్నెచోడు ననుస రించి ఈ ముద్రాలంకార సంప్రదాయమును పాటించిరి.

ఉదా. ఉత్పలము - "ఉత్పలగంధి నెన్నడుగు మొద్దను బంపుము.
(భార. విరా. 2-23)

నంది, మల్లయ ఘంట, సింగయ కవుల వరాహ పురాణమున - నీ ముద్రాలంకా రము గలదు - తరువాత కొందరు కవులును నీ సంప్రదాయము ననుసవరించిరి విస్తర భీతిచే ఉదాహరణల నీయలేదు.

కథా సందర్భము ననుసరించి పై పద్యమున నింకొక విశేషమున్నది. వృత్తములో నున్న మత్తేభ విక్రీడితము వాస్తవముగా జరిగినది. ఇది గజాన నోత్పత్తికి కారణమైనది. పార్వతి ఇంగితమెఱిగి శివుడు గజరూపము దాల్చి - కరియైనాడు - పార్వతి కిరేణువు - ఆడ యేనుగ రూపము దాల్చినది- వారిరువురి సంగమము వలన - గజముఖము మానవాకారము గల గణపతి జన్మించెను.

కుమార సంభవ కావ్యము - గణపతి జననము తోడనే ప్రారంభమగు చున్నది. ఇందునొక సంప్రదాయమిమిడి యున్నది.

ఈ నాడు మనమేవ్రతము చేసినను, ఏ కార్యము తలపెట్టినను ప్రారంభ మున గణపతి పూజ చేసెదము. అట్లే కుమార సంభవ కావ్య ప్రారంభమున - గణపతి పూజకు బదులుగా - గణపతి జన్మ కథావృత్తాంత మున్నది.

క. వనధి గల నగములన్నియు
ననిమిష పతిమీఁద నడవనని యెగసెనొకో
యన నాకాశము దాఁకఁగఁ
దనరఁగ నత్యున్న తోర్మి తతి విలసిల్లెన్ -

ఇది సముద్ర వర్ణన లోనిది.

సముద్రమున కెరటములు గుంపులు గుంపులుగా ఆకాశమంత యెత్తున పెరిగి దానిని దాకుచున్నవి - భూమిమీద నున్న సముద్రమున కెరటములు సాధారణముగ కొంచెమెత్తుగా మాత్రమే కనబడును.

ఆ కెరటముల యౌన్నత్యమును కవియిట్లు చమత్కరించి మొదట నగములకు - కొండలకు - ఱెక్కలుండెడివి. ఆ ఱెక్కల మూలమున అవి యెగిరి లోకమునకు హాని గావించుచుండెడివి. అప్పుడు దేవతలు ప్రార్థింపగా, ఇంద్రుడు తన వజ్రాయుధము చేత - ఆ కొండల ఱెక్కలను ఖండించినాడు. అప్పుడు కొన్ని కొండలు - ఇంద్రుని బారినుండి తప్పించు కొనుటకు - సముద్రములో దాగినవి. ఈ సముద్రమున నురుగులాకాశమున కంటుచున్నవనగా — ఆ సముద్రములో దాగిన కొండలు - "ఇదిగో మా మీద నీవు దండెత్తి వచ్చినావు - ఇప్పుడు నీపై మేము దండెత్తు చున్నాము చూచుకొమ్మని వచ్చుచున్నట్లున్నవి.

అనిమిష పతి (ఇంద్రుడు) స్వర్గలోకమున నుండును గావున నిది యెంతయు చక్కగా నున్నది.

ఇంద్రునికి వెఱచిమైనాక పర్వతము సముద్రములో దాగుకొని హనుమంతుడు సముద్రము లంఘించునపుడు కొంచెము సేపు ఆతనికి ఆశ్రయ స్థానమైన యుదంతము రామాయణమున గలదు.

క. జానఱి పశుపతి నుఱక వి
తానమహారంభుడైన దక్షుం డను న
జ్ఞానికి మును కొని వచ్చు వి
మానంబన నమరసతి విమానము వచ్చెన్ (2-18)

శివుని లెక్కసేయక ధిక్కరించి దక్షుడొక యజ్ఞము తలపెట్టెను - అందఱు దేవతలు వచ్చిరి - శివుని పిలువలేదు - అందు వలన ఆ యజ్ఞము పూర్తికాలేదు సరేగదా, దక్షునకు "చావు తప్పి కన్ను లొట్టయినది" అన్నంత పని జరిగినది దక్షుని తలతెగవలసినదే గాని తప్పినది.

దానిని కవి చమత్కారముగా నిట్లుచెప్పినాడు.

తన భర్తని పిలువ లేదని సతీదేవి దక్షునికి బుద్ధి చెప్పుటకు విమానము మీద వచ్చినది. విమాన శబ్దమునకు, శైవుల పరిభాషలో వేరొక యర్థమున్నది.

శైవులలో మృతులైనప్పుడు - శవమును ఇతరులవలె పాడెపై కట్టి స్మశానమునకు తీసికొని వెళ్ళరు - శవమును కూర్చుండబెట్టి - ఒక విమానము కట్టి ఆ విమానముతో తీసికొని వెళ్ళెదరు. దీనినే నన్నెచోడ కవి యిచట చమత్కరించినది.

"పితృవనంబునదాక పతి విమానము వెంటఁ
గై సేసి కొలనాడ గదలఁ భంగిః
అని శ్రీనాథుడు కాశీఖండమున దీనిని సూచించినాడు. (2-86)

పితృవన మనగా శ్మశానము.

శైవులు విమానముననే కైలాసమున కేగెదరు.

క. హరలీలాస్తవ రచనా
స్థిర నిరుపమ కీర్తి తనదు దేహము తోడన్
సురుచిర విమానమున నీ
పురమున కుద్భటుఁడు ప్రీతిఁబోవఁడె రుద్రా
(శివ తత్త్వసారము. 410 ప.)

పైపద్యమున విమాన శబ్దము శ్లేషింప బడినది.

విమానము - అవమానము

విమానము - ఆకాశమున ప్రయాణము చేయునది.

గీ. తల్లిదండ్రులఁ బూజించి తగవెఱింగి
మన్నవొదవైననే అత్త మామలనియుఁ
బ్రియమెఱుంగు డందిచ్చిన బిడ్డమనకుఁ
బాసెనని యుండుఁడింక నాపలుకు లేలః (2-4)

శివునికి మామయైన దక్షప్రజాపతికి కశ్యపుడు, చంద్రుడు, యముడు అను మఱి ముగ్గురు అల్లుళ్ళున్నారు. ఒకనాడు దక్షుడు, వారిని చూచుటకు వెళ్లినాడు. తక్కిన ముగ్గురల్లుళ్లు, మామగారినెంతో గౌరవించి పంపినారు. కాని శివుడు మాత్రమట్లు చేయలేదు. తన మామగారెదురుగా వచ్చుచున్నను, తాను లేవక, ఆయనను అగౌరవ పరచెను. దక్షుడు వెంటనే తిరిగి ఇంటికివచ్చి భార్యతో

శివుడు తన్నెంత మాత్రము లక్ష్యము చేయలేదని - కోపముతో చెప్పెను. ఆప్పుడామె పైరీతిగానన్నది.

"లోకములో తల్లి దండ్రీ ఉన్నవారికి, అత్త మామా అనే సంగతి తెలుసునుగాని తక్కిన వారికి తెలియదు. మన బిడ్డను మనము. తల్లి తండ్రీలేని శివునికి పెండ్లి చేసినాము - అట్టివాడు మిమ్మలిని - లెక్కచేయ లేదంటే - అతని తప్పేమీ లేదు - అట్టివానికి పిల్లనివ్వడము మనదేతప్పు. కాబట్టి మన పిల్లకీ మనకూ సంబంధము తెగిపోయిందని అనుకోండి"

ఇది అచ్చంగా, తెలుగు ఇల్లాలు మాటలాడిన మాటలు.

ఆ. ఆధిపుఁ జెట్ట లాడెనని దక్షుఁగని సతి
కదరు కోపవహ్ని నొడలు గాలె
వగవ నట్లు నెట్టివారికిఁ బ్రియునిరా
కరులఁగాంచి యొడలు గాలకున్నె?

దక్షుడు అల్లుడైన శివునిపై కోపము చేత ఒక మహాయజ్ఞము తలపెట్టి, దేవతలనందఱను బిలిచి, ఈశ్వరుని పిలువలేదు - అది సతీదేవికి తెలిసి శివుని ఎందుకు పిలువలేదో కనుగొందును అని తండ్రి యింటికి వచ్చినది, యజ్ఞానికి వచ్చిన దేవతలందఱు ఆమెకు నమస్కరించి - గౌరవించివారు. అయితే దక్షుడు మాత్రము, ఇట్టి యజ్ఞములోనికి వచ్చుటకు ఎముకలు, కపాలము, రుద్రాక్షలు విభూతి మొదలైన వేద విరుద్ధ వస్తువులు ధరించిన నీ భర్త వచ్చుటకు వీలు లేదు" అని శివుని తూలనాడెను, ఆతని రాకను నిరాకరించెను.

సతీదేవి తన భర్తను నిందించినందుకు తండ్రిపై, మిక్కిలి కోపముతో తన శరీరమునుంచి అగ్నిపుట్టించుకొని, శరీరము నంతయు, ఆ అగ్నిలో దగ్ధము చేసినది, ఆమె ఒడలు, మండు చున్నపుడు కవి యిట్లు జాతీయముగా మగని నిరాకరించిన ఒడలు మండిపోదా? అని వ్యాఖ్యానించినాడు.

ఒడలు మండిపోవడమన్న జాతీయము ఈ నాడు మనకున్నది.

"వాడిని చూస్తే నాకు ఒళ్లుమండి పోతుంది"

గీ సలలితంబగు శశికాంత శిలలరుచులు
నింద్రనీలోత్పల ద్యుతు లెనసి వెడల
పక్షు లెల్ల సితాసిత పక్షయుగళ
సహితమై చూడనొప్పు మాసముల వోలె (3-11)

ఇది హిమవన్నగ వర్ణన యందలి పద్యము.

కాళిదాసు కుమార సంభవ ప్రారంభమున హిమవంతమును వర్ణించినాడు. నన్నెచోడ కవి అందలి భాగముల నొక్కటి మాత్రమే గ్రహించి, తక్కిన భావములన్నిటిని స్వతంత్రములుగా సంతరించినాడు. అందు పై పద్యమొకటి బహు మనోహరమైన భావనగలది.

హిమవత్పర్వతమున ఒకప్రక్క తెల్లని చంద్రకాంత శిలలు గలవు. మఱియొక ప్రక్క నల్లని ఇంద్రనీల శిలలుగలవు. ఆ మధ్య ప్రాంతమున, పక్షు లెగురు చున్నప్పుడు, ఆ పక్షుల రెండు ఱెక్కల పైన, ఒకవైపు తెల్లని చంద్రకాంతముల కాంతి పడి మఱింత తెలుపుకాగా, మఱియొక ప్రక్క ఱెక్కపై నల్లని ఇంద్రనీలముల కాంతిపడి, వానిని నల్లగా చేయుచున్నవి. అప్పుడా పక్షులకు, ఒక ఱెక్కతెలుపు: మఱియొక ఱెక్క నలుపు అయినది. ఈ విషయము, "సితాసిత పక్షయుగళ సహితము" అని చెప్పబడినది.

అవి మాసములవలె నన్నవి, అని కూడ కలదు. మాసమునకు శుక్ల పక్షము, బహుళ పక్షము అని రెండు పక్షములు. శుక్లపక్షము, వెన్నెల తెలుపు, బహుళ పక్షము చీకటి నలుపు

ఆ పక్షులాకాశమున మాసములు పోలె ఎగిరిపోవు చున్నవని ఉపమింపబడినది, ఈ ఉపమానముకు ప్రమాణము.

'పక్షము' అనగా మాసభాగమను ననేగాక పక్షిఱెక్కలను అర్థము కలదు. మనకు కాలగమనములో పక్షులెగిరి పోవునట్లుగా మాసము లట్లే ఎగిరిపోవు చున్నట్లు కనుపట్టుట సహజము.

ఇట్లు పక్షులతో మాసముల కుపమానమున చమత్కారమేగాక సార్థకత భాసించుచున్నది.

క. గిరిసుత తొలుపలుకుల సు
స్వరమొదవంగ "నోం నమశ్శివాయ సదాస్మ
ద్వరదాయ నమశ్శంకర
శరమహాదేవ" నీవ శరణనఁ జొచ్చెన్. (౩—౩౩)

పార్వతిదేవి మాటలు నేర్చునపుడే, "ఓం నమశ్శివాయ" అను మంత్రము పఠించినదట, అనగా అక్షరాభ్యాస కాలమునందే మంత్రపఠనము గావించినదని తాత్పర్యము.

ఈ సందర్భమున కాళిదాసు మూలమున,

"ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యాః" (1-31) అని కలదు, పూర్వజన్మ సంస్కారముచేత పార్వతికి అన్ని విద్యలు తమంతట తామే అలవడినవని భావము.

కాని నన్నెచోడ కవి యిచట, నేటికిని వాడుకలో నున్న అక్షరాభ్యాస విధానము తెలిపినాడు. అక్షరాభ్యాసము చేసినప్పుడు, మొదట "ఓం నమ శ్శివాయ" అని పిల్లలచేత వ్రాయింతుము. నన్నెచోడని కాలమున (12 వశతాబ్ది) ఆడపిల్లలకు మగపిల్లలవలెనే అక్షరాభ్యాసము చేయుచుండెడి వారని తెలియు చున్నది. జయ రమాకన్యక చదువు పలక అని పారిజాతపహరణము (1-26)న గలదు.

"ఓం నమశ్శివాయ" అన్నదే "ఓనమాలు"గా వాడుకలోనికి వచ్చినది.

"సీ.పా. నన్నయ్యవార లోనామాలు దిద్దుకొమ్మనినచో కడుపు నొప్పనుచు నేడ్చి, (హంస.3-141)

"ఓం నమశ్శివాయ" మంత్రములో అక్షరాభ్యాసములు ఆరు, పిల్లల మట్టిపిన పీరన ఇట్లు తెలిపినాడు.

గీ. అహహః అభ్యాస వేళ బాల్యంబునందు
వ్రాసి చదివిన యారక్షరములచేత
వశ్యముగఁజేయవచ్చు భావజ విరోధి
ఏల యెఱుఁగరొ ఈమర్మ మితర జనులు. (శృం.శా. 4-51)

క. సారము లాశ్రిత భాషా
సారము లాసకలవస్తు సంపూర్ణాలం
కారంబులు శ్రీవర్ణా
కారంబులు చెవులు సుకవి కావ్యమువోలెన్ (3-67)

ఇది పార్వతి చెవుల వర్ణన.

ఆమె చెవులు 'శ్రీ' అను వర్ణమూలేక అక్షరములవలె నున్నవి. కాళిదాస మూలమున నీ వర్ణనలేదు. నన్నెచోడ కవి యిచట తెలుగు లిపి సంప్రదాయమును తెలుపుట కిట్లు వర్ణించినాడు, ప్రస్తుతము మనము,

'శ్రీ' అనురీతిగా వ్రాయుదుము. కాని పూర్వకాలమున నీ యక్షరము "శ్రి" అను రీతిగా వ్రాసెడివారు, శాసనములందు దీనిని చూడవచ్చును. ఇది సరిగా చెవి ఆకారముననే యుండును.

తెలుగున శ్రీ కారము చాల ప్రాధాన్యత వహించినది. వేదమునకు ఓం కారమువలె తెలుగు కావ్యమునకు శ్రీ ప్రారంభము. శ్రీ తో మొదలుకాని కావ్యము పూర్వకాలమున లేనే లేదు. ఆధునిక యుగములో నైన పద్య కావ్యములు శ్రీ తోనే ప్రారంభించినవి లేకపోలేదు.

పూర్వము కావ్యము శ్రీ తో మొదలుపెట్టి మంగళ మహాశ్రీ. వృత్తముతో ముగించెడి వారు. మంగళ మహాశ్రీ వృత్తములో, శ్రీకారము చివరది ఈ సంప్రదాయము వలననే, నన్నెచోడకవి చెవులు సుకవి కావ్యము వలె నున్నవి, అని వ్రాసినాడు. నన్నెచోడని తరువాత కవులందఱును, చెవులను శ్రీ కారముతో పోల్చిరే గాని, కావ్యము వలె నున్నది యని వర్ణింప లేదు.

ఇది యాతని కర్ణ వర్ణనా ప్రత్యేకత దెలుపు చున్నది చెవులు శ్రీకారములుగాన శ్రీ తో ప్రారంభించి, మంగళ మహాశ్రీతో ముగించుట యనగా, కావ్యమును మన మాద్యంతము వినవలెను అని యర్థము,

ద. ఆంధ్రీ స్తనాపహాసులు
సంధృతమధు పాజ్జముకుళసదృశము లతి నీ
రంధ్రములు కుచము లఖిలపు
రంధ్రీ జనతిలక మచల రాజాత్మజకున్ (3=54)

పార్వతీదేవి పయోధర వర్ణన.

ఆమెకుచములు, తుమ్మెదలు నిలిచి యున్న పద్మ ముకుళమును బోలి, మధ్య నేమాత్రము నెడము లేక ఆంధ్రీ స్తములను నపహసించు చున్నవి.

"అన్యోన్యము త్పీడయ దుత్పలాక్ష్యాః
స్తనద్వయం పాండు తథా ప్రవృద్ధమ్
మధ్యేయథాశ్యామ ముఖస్య తస్య
మృణాల సూత్రాంతర మ ప్యలభ్యమ్ (1=40)

"ఆమెస్తనములు నొకటి నొకటి ఒరసి కొనుచు, వానిమధ్య మృణాల సూత్రము (తామర తూడులోనుండుఅతిసన్నములగు నరము) దూర్చుట కైనను సందు లేకుండ నున్నవి. అని పైశ్లోక భావము.

"ఆంధ్రీ స్తనాపహాసులు" అన్న విశేషణము అచ్చముగా దేశీయమైన వర్ణన ఆంధ్ర స్త్రీ స్వరూపమునకు యావద్భారత వర్షమున నఖండ యశస్సును సంపాదించిన ఆంధ్ర వనితాపయోధర ప్రత్యేక విశిష్టత చక్కగా పైన విశదమైనది.

ఆంధ్రీస్తన స్తవనీయ మనోహరత, అజంతా శిల్ప కళాఖండములలో బహు ప్రాచీనకాల మునుండి ప్రత్యక్షమగు చున్నది ఇక శిల్పముల యందేగాక కవుల సూక్తుల యందును నివి వర్ణితములు.

రాజ శేఖర కవి (క్రీ.శ.920) చాటువు.

కర్ణాటీ దశనాంకిత మహారాష్ట్రీ కటాక్షాహతః
ప్రౌఢాంధ్రీస్తన పీడిత ప్రణయినీ భ్రూభంగ విత్రాసితః
లాటీ బాహు విపేష్టితశ్చ మలయస్త్రీ తర్జనీ తర్జితః
సోయం సంప్రతి రాజశేఖర కవిర్వారాణసీం వాంఛతి"

నేను కర్ణాట కామినుల దంతక్షతములను (పెదవి కొఱుకులు) దక్కించుకొన్నాను. నవ్వుచున్న మహారాష్ట్ర నారీరత్నముల క్రేగంటిచూపులచే హతుడనైనాను. ప్రౌఢములైన ఆంధ్రీ పురంధ్రుల వక్షోజముల కౌగిలి ననుభవించినాను. వారి కను బొమ్మల విలాసమునకు ముగ్ధుడనైనాను. లాటీ దేశపు లావణ్యవతుల బాహు పాశములచే బంధితుడనైనాను. మలయ మగువల చేతి బొటన ప్రేలి మాటలకు మన్నికైనాను. ఇట్లు నానా దేశ స్త్రీ సౌఖ్యముల ననుభవించి, పవిత్రమైన వారాణసీ (కాశి) క్షేత్రమును కోరుచున్నాను. "అని రాజశేఖరుడు తెలిపి, కుచ సౌభాగ్యమునకు ప్రత్యేకముగా తెలుగు పడతుల కోపట్టము కట్టినాడు.

నేటి వ్యవహారము ననుసరించి చెప్పవలసి వచ్చినచో కుచసౌభాగ్యము, ఆంధ్రకాంతల కాపీరైటు హక్కు. కన్నడదేశమున ఆదికవి యని ప్రసిద్ధికెక్కిన పంప మహాకవి పంపభారతమున నిట్లుగలదు.

క. కేరళ విటీ కటీసూ
త్రారుణమణి, మలయ యువతి దర్పణమాంధ్రీ
నీరంధ్ర బంధుర స్తన
హారముదా రం సరస్వతీమణిహారం. (1-36)

నన్నెచోడ కవి దీకంద పద్యమే, నీరంధ్ర శబ్దము రెండింటను సమానమే

సీ. మొనలావులించి వాసన నల్లఁబసిగొని
లేఁదేఁటిగము లెంగు లింపకుండ
ఎడసూఁఱ గొనఁ వేచి సుడియు తెమ్మెరలచే
పొడము పుప్పొడి పొలివోపకుండఁ

దరణికూటమున మేయురవి పద్మినిమేన
మొల తెంచుమధు మదములఁక కుండ
మేల్కాని గోమిని మెలఁగిమై ముఁటిసినఁ
బొదిగొన్న యకరువు సెదర కుండ
తే. తెలిసి జక్కవ లొండొంట కలయఁ దారు
కలకలంబున జేకులు గదలకుండ
మున్న కొని వచ్చి గణికా సమూహితోడ
గిరిజఁ బూజించెఁ బసిడి తామరలవరదు (3-180)

ఇందు పార్వతి వేకువజామున శివుని పూజించుట వర్ణితము. వేకువ ప్రకృతి కంటె విశదముగా నిందు. శైవ సంప్రదాయిక మగు షట్కాల శివ పూజ శివపూజాపుష్ప ప్రత్యేక విశిష్టత వివరింప బడినది.

వేకువ జామనగా అరుణోదయము.

శైవునకు, షట్కాల శివపూజ నియతము, అరుణోదయ, తపనోదయ, సంగమ మధ్యాహ్న, సాయంకాల అర్ధనిశలు షట్కాలములు, ఇచ్చట అరుణోదయ మున చేయు శివపూజ వర్ణితము.

పార్వతి అరుణోదయమున, పసిడి తామరలతో శివుని పూజించెను. పసిడి తామరలనగా బంగారు తామరలు. ఆకాశ గంగయందు బంగారు తామర లుండును.

"సీ.పా చదలేటి బంగారు జలరుహంబుల తూండ్లు
భోజనంబులు మాకు పువ్వుబోణి. (నైష 2-2)

శివపూజ కుపయోగించు పుష్పము అరుణోదయముననే కోసిపూజకు సిద్ధము చేయవలెను. తరువాత సూర్యోదయమైన అవి పనికిరావు ఈ సంప్రదా యము పై పద్యమున నిరూపితము.

ఆ పూవులపై తుమ్మెదలు వ్రాలరాదు. అవి పూతేకులను తాకిన, అవి యెంగిలి యగును పాల్కురికి సోమనాథుడు దీనిని గూర్చితెలిపినాడు.

ద్వి. తుమ్మెదల్ నెమ్మివాతులు దొల్చితొల్చి
కమ్మని వేఁగంపు గవియునో యనుచు
విచ్చిషట్పదములు వెసఁగ్రోలి గ్రోలి
అచ్చవాసన వెదిపుచ్చునో యనుచు. (పం. పురా. 64పుట.)

2. వ పాదము. పూవులలో గాలిసోకి పుప్పొడిని నశింప జేసినవి నిషిద్ధములు. సోమనాథున కీవిషయమున తుమ్మెదలే పుప్పొడిని నశింపజేసినట్లు చెప్పినాడు.

ద్వి. తొడరి భృంగములు పుప్పొడి రాల్ప రాల్పఁ
గడివోయి రేకులు గందునో యనుచు

3. వ పాదము. సూర్యకిరణ ప్రసారమువలన తామరనుండి మధుకరణములు స్రవించును అవి నిషిద్ధములే.

సోమనాథుడు సూర్యకిరణములుగాక తుమ్మెదలే వీనిని చేసినట్లు వర్ణించినాడు.

ద్వి. గడివోవ నళులానగా రేకు వెడలి
యుడిదేనెవైన పర్యుషిత పుష్పములు

4. వ పాదము. సూర్యకిరణ ప్రసారముచే పుష్పములలో అకరువు దుద్దు చెదరి అందున్న లక్ష్మి పైకిలేచును.

ఈ పాదమున గోమిని యనగా లక్ష్మి.

లక్ష్మి తామర అకరువు దుద్దు నందుండుననుటకు.

"భక్తి ప్రహ్వాయదాతుం ముకుళపుట తటీకోట రక్రోడలీనాం
లక్ష్మీ మాకృష్టు కామా ఇవ కమలవనో ద్ఘాలనంకుర్వతేయే
(సూర్యశతకము 2శ్లో.)

"కమల వనమును పగులగొట్టి ముడుచు కొనియున్న తామరల కర్ణిక యందుండెడి లక్ష్మిని ఏ కిరణములు పైకివచ్చునట్లు చేయుచున్నవో, ఆ కిరణ ములు అని. తరువాతి పాదములతో అన్వయము.

గీతము. జక్కవలు జంటగా ఎగురు చున్నపుడు వానిని కలకలము వలన ఱేకులు కదలిన పుష్పములు పనికిరావు.

సోమనాథుడు దీనిని భృంగ పక్షముగానే చెప్పినాడు.

"ద్వి. పరిమళావృత భృంగ పక్షోపనిహతిఁ
జిరిగిన ఱేకులు ఛిద్ర పుష్పములు"

సోమనాథుడు సూర్యోదయమైన వెనుక, తుమ్మెదల ప్రభావము హెచ్చుగా నుండును గాన అట్లువర్ణించినాడు. కాని నన్నెచోడని వర్ణన, అచ్చ ముగా అరుణోదయమున నున్న పూవుల పరిస్థితి తెలిపి తన ప్రకృతి పరిశీలన నిరూపించినాడు. అరుణోదయముననే పార్వతి పూవులుకోసి పూజించినదని సారాంశము.

శివపూజా పుష్పములపై తుమ్మెదలు వ్రాలరాదన్న విషయము, నాచన సోముడు తన యుత్తర హరివంశమున నిట్లు తెలిపినాడు.

సీ.పా. పూజార్థ నియమిత పుష్ప వాటికలందు,
మధుకరంబులఁజోపు మమర్కటములు. (2-109)

సోమనాథు డీ సందర్భమున నింకొక నియమము చెప్పినాడు. పువ్వులు చెట్లనుండి రాలి క్రిందపడినవి అపవిత్రములు అవియు పూజకు నిషిద్ధములు.

"అపవిత్రమైనవి యవియాదిగాగ
నుపహత పుష్పంబులోలి వర్జించి"

నాచన సోముడు దీనిని తెలిపినాడు. పూవులు చెట్టునుండిక్రిందికి రాల కుండ ఏనుగులు తమ తొండములతో చెట్టుకొమ్మలను పట్టుకొని నిలుపు చున్నవి.

సీ. పవన వేగ విశీర్ణ పాద పాగ్రంబుల
మధుకరంబులఁజోపు మర్కటములు (2-109)

పై యుదాహృతులనుబట్టి నాచన సోముని ఉత్తరహరి వంశమింకను నెంత సూక్ష్మముగా పరిశీలింప వలెనో తెలియ గలదు.

ఉ. అతని శరాసనమ్ము కనకాచల మిక్షుశరాసనమ్ము నీ
కతనికి యమ్ముపాశుపతమంటినఁ గందెడు పూవుటమ్ము నీ
కతఁడు పురాపహారి విరహాతుర పాంథ జనాపహారి వీ
వవనికి నీకు హస్తిమశ కాంతర మెమ్మెయి నెన్ని చూచినన్ (4-12)

శివునిపై దండెత్తబోవునపుడు, రతీదేవి యన్నమాటలు కాళిదాసు మూల మున రతీమన్మథుల సంభాషణయే లేదు. ఇంద్రుడు ప్రేరేపింపగానే మన్మథు డాతనిపై దాడివెడలినాడు. ఈ సందర్భమున నన్నెచోడ కవి వారిరువురి నడుమ సంభాషణ ప్రవేశపెట్టి మూల కథ కెంతయో రామణీయకము సమ కూర్చినాడు.

"నీవు ఈశ్వరునిపైకి యుద్ధమునకు బోవుచున్నావుగాని నీకు అతనికి హస్తిమశ కాంతరము సుమా. ఏనుగంత వాడతడు దోమ వంటివాడవునీవు, శివుని మహత్త్వమును నీ అల్పత్వము నీవు గమనింపలేదు. అతడు మహత్తు

లకు మహాత్ము: నీవు అణువులలో పరమాణువవు నీకు అతనిని అంత వార యన్నది.

అతని విల్లువంచుటకు వీలలేని మేరువైతే నీవిల్లు పట్టుకోగానే విఱిగి పోయే చెఱకు గడ అతని అస్త్రము అన్నింటిని దహించే పాశుపత మైతే నీకు అంటితే కందిపోయే పూవుబాణము అతడు అజేయులైన త్రిపురాసురులను జయించిన నీవు అసహాయులై, దారిన పోయే బాటసారులను జయించెదవు ఇంతేకదా నీ శక్తి. కాబట్టి నీకు ఆయనకు అణుమాత్రము పోలికలేదు. వియ్యానికైనా సమానత్వ ముండవలెనన్న మాటమఱచి పోయినావు.

హస్తిమశ కాంతరము తెలుగున ఒక జాతీయముగా పరిణమించినది దీనిని తొలుత వాడినవాడు నన్నెచోడుడే తరువాత తిక్కనాదులు దీనిని వాడు కొన్నారు.

తిక్కన- "హస్తిమశ కాంతరము కలదరసి చూడ" భార. శాంతి. 4.112

జక్కన- "హస్తిమశ కాంతరముగాదె యలవుకవిమ" విక్ర. 4.68

నంది మల్లయ, ఘంట సింగయ | హస్తిమశ కాంతరంబు సంశయము లేదు. వరా. 2-146

సీ. కొని బాలుడైనను తిని పిప్పి యుమిసెడి
చెఱకు విల్లనినమ్మి చేతబట్టి-
మెలఁతల తలమెంద్రుకలఁ బొంది కందెడు
నలరు పువ్వులునమ్మి లనితలంచి
తలిరాకు నైనకదల్పనోపని మంద
పవనుండు నొకపెను ప్రాపుగాఁగ
నబలలు సోపిన నాకాసగతి బాలు
నలశుకములు మూలబలము గాఁగ
గీ. నెంత వేసవి ముట్టిన నెండగమరు
నను వసంతుండు తగుసహాయుండు గాఁగ
కాకిపిల్లల కోడునో పికములు బోటు
మగలుగాను గ్రుపైఁ బోవదగునె మదనః (4-76)
ఇవి రతి మాటలే - తెలుగువారివి

ఈశ్వరునిపై దండెత్తుచున్నావు. అంతేగాని నీకుగల యుద్ధసామా గ్రెట్లున్నవో చూచుకొన్నట్లులేదు.

నీ విల్లు చెఱకుపిల్లు- బాలకులు సైతము కొని, తిని పిప్పి ఉమ్మివేసే టటు
వంటివి.

నీబాణములు పువ్వులు — ఆడవారు తలవెండ్రుక కలలో ముడుచుకొనగానే
నలిగి పోయినవి.

నీప్రాపు — గాడి అది — చిన్న వేత చిగురునైనా కదల్పలేనిది.

నీమూలబలము-చిలుకలు అవి అబలలు "హుష్" అంటే ఆకాశానికి ఎగిరి
పోయేవి.

నీసేనానాయకుడు వసంతుడు తీక్షణముగా ఎండ కాయ గానే కంది, వాడి
పోయేవాడు.

నీబంట్లు కోకిలలు కాకిపిల్లలు కావు కావు మంటే పారిపోయేవి.

ఇట్టి వారి సహాయంతోనా, నీవి-ఆ మహోగ్ర స్వరూపుడైన శివునిపై యుద్ధానికి వెళ్ళేది-

ఈ పద్యమున-చక్కని జాతీయ ధ్వనియున్నది. మనము సాధారణముగా ఒక వస్తువుయొక్క-గాని మనిషియొక్క-గాని ప్రయోజనాన్ని తెలిపే సందర్భమున-ఉపయుక్తముకాని-వస్తువుగాని మనిషినిగాని గూర్చి చెప్పవలసివచ్చినప్పుడు-

"ఓస్ అదీ ఒక వస్తువేనా వాడూ ఒక మనిషేనా" అని అంటాము-పై పద్యమున-

"చెఱకు ఒక విల్లేనా-వసంతుడూ ఒక మనిషేనా" అని ధ్వని-ఇట్లే తక్కిన వానిని సమన్వయించుకొనవలెను.

ఆ. వె. ఆట దానన బలనైన నేనించుక
నలిగి చూచు టకు భయమునఁదలరు
నుగ్రు నుగ్రలోచనోద్భూత వహ్నికి
నెదిరి నిలువ నీకు నెంతకొలఁది (4-74)

నేను ఆడదానిని-అబలను-బలహీనురాలను-నిస్సహాయురాలిని-అయినా నాకు కోపమువచ్చి నిన్ను తీవ్రంగా చూచేసరికి-నువ్వు-పాపము! తల్లక్రిందులై భయపడి, తుక్కైన పేనువలె-అయిపోతావే-అలాంటి వాడివి-కోపమువస్తే కూకటి వేళ్ళతో నాశనము చేసే ఉగ్రనేత్రుడైన శివునిపై దండెత్తడానికి ఎలా సిద్ధపడ్డావు.

ఆడదానిని నన్నే నువ్వు జయించలేక పోయినప్పుడు మగలకు మగడైన-మహేశ్వరునిపై యుద్ధానికి వెళ్ళి అతని జయించడము-అసంభవము-అని చివర చెప్పినది.

అదిమి పట్టిన కరులైన చదియునట్టి
కదిఁది బలులగు మగలొత్తి కౌఁగలిఁప
కుసుమ కోమలు లగు సతుల్ కొసరు చునికి
కనియు నెఱుఁగవె విపరీత కామశక్తి. 4-79

భర్త రతీదేవి చెప్పిన మాటలన్నీ మన్మథుడు విన్నాడు. అయ్యో ఈశ్వరునిపై దండెత్త డానికి సిద్ధపడు తున్నాడే-ఏమై పోతాడోగదా-అని మనస్సులో తహతహలాడి పోతున్న రతీదేవి మనస్సును మన్మథుడు గ్రహించినట్లే లేదు-కాముకులు-ఎదిరివారి మనస్తత్వము గ్రహింపలేరు కదా అందును-అసలు కాముడే-మన్మథుడే యిప్పుడు రతితో పైమాటలు చెప్పినాడు-అవి సహజములే-

బలవంతులైన మగవారు అదిమి పట్టినట్లయితే అన్నింటికన్నా బలమైన ఏనుగులుకూడా అణగారి పోవలసినదే-అట్టి మగవారు కౌగలించు కొన్నప్పుడు-అంటితే కందిపోయే పుష్పసుకుమారులైనటువంటి ఆడవారు-"ఇంకా గట్టిగా కౌగలించుకొండి-కౌగలించుకొండి కొసరి కొసరి అడుగుతూనే ఉంటారే-అట్టి మగవారిశక్తి సంగతి నీకు తెలిసికూడా ఇలాగ అనడము వింతగా నున్నదే-

ఇచట విపరీత కామశక్తి-అనుమాట సార్థకము అదిపరీతము-హద్దు ఆటంకములు-అవధులు లేనిది-ఎట్టివారినైనా వశపఱచుకొను సామర్థ్యముగలది త్రిమూర్తుల కతీతుడైన శివునే, మన్మథుడు చలింపజేసి, తన శక్తిని చూపుట తరువాత జరిగినది-

పై రతీదేవి సంభాషణలో-సతీధర్మము నిరూపింప బడినది-భార్య యెప్పుడును-పతిహితమునే కోరును-అతని శ్రేయస్సునే యాకాంక్షించును-అదియే ఆమె జీవిత ధ్యేయము-రతీదేవి, మన్మథుడు తలకుమించిన పనికి పూనుకొన్నాడని-అతనికి అపజయము తప్పదని గ్రహించినది-అపశకునములుకూడ ఆమెను బలవంతము చేసినవి-అతనిని శివునిపై దండెత్తవద్దని ఈశ్వర మాహాత్మ్యము వివరించి బోధించినది. కాని మన్మథుడు వినలేదు. శివుని కంటిమంటల కాహుతి యైనాడు.

ఉ. ఆలసి తస్మితాస్య లలితామల కోమల చంచలాల సా
లోల విశాల సంస్ఫురిత లోచన దృష్టి రస ప్రవాహమం
దోలిన పర్వి వెల్లిగొని, యొక్కట గ్రక్కునముంచి మీదికిం
దేలఁగ నెత్తి చుట్టి హరుఁ ద్రిప్పులఁ బెట్టి మనోజుఁ డుబ్బఁగాన్. (5-84)

శివునిపై మన్మథుడు బాణము వేసినాడు. ఆతడు పార్వతిపై దృష్టి నిలిపినాడు-అప్పుడు పార్వతి తన చూపులచే నెట్లు శివుని వశపఱచుకొన్నది వర్ణించునది పై పద్యము-

వనితల చూపులను వర్ణించిన కవులు గలరు, కాని ఇంత నిశితముగా, ఇంత శాస్త్రీయముగా, ఇంత సరసముగా వర్ణించిన కవులు లేరు-

పార్వతి చూపులకు - లలితములు - అమలములు-కోమలములు-చంచలములు-అలసములు - లోలములు — విశాలములుస్ఫురితములు - అను ఎనిమిది లక్షణములు చెప్పబడినవి అవి అందములై తెల్లనివియై సుకుమారములై, చంచలములై మందములై కదలికలు గలవై విశాలములై అనురాగమును స్ఫురింప జేయుచున్నది. అంతేకాదు అవి ఒక ప్రవాహముగా పరిణమించినవి. ఆ దృష్టి ప్రవాహము శివునిపై ఒక్కమారు వెల్లివలె వచ్చి అతనిని అందు ముంచి పైకి లేవనెత్తినది-శివునటు ఇటు త్రిప్పి-త్రిప్పుల బెట్టినది—దానితో మన్మథుడుబ్బిపోయినాడు-అతనికి పట్టరాని సంతోషము గలిగినది.

పై శ్లోకమున వర్ణితమైన మాలతి మానవ నాయిక నన్నెచోడకవి వర్ణించిన నాయిక దివ్యనాయిక. అందువలన నన్నెచోడకవి—మానవపరమలైన కంటి నల్లగుడ్డు, దట్టములగు కనుఱెప్పలు, వీనిని విరిచినాడు—ముగ్ధత్వము-స్నిగ్ధత్వము రెండును—మానవతా గుణములే-కావున ఆ రెంటిని పరిహరించినాడు-చూపులలో తక్కిన లక్షణము లనుసరించినాడు.

"మాలతి నా హృదయమూలము లేకుండ చేసినది" అను భావమును పూర్తిగా విస్మరించినాడు నన్నెచోడుడు—హృదయమును లోగొనుట మానసిన వ్యాపారము—అది ఆంతరంగికము—చూపులచే లోగొనుట-లేక నాయకుని వశము చేసికొనుట బాహ్యవ్యాపారము-

తొలుత దృక్సంగమము-చూపుల కలయిక-దృఢముగా కలిగినగాని-హృదయసంగమము-మనస్సంగమగుట తటస్థింపదు-కనుక దృక్సంగమ భావములకు మనస్సంగమ భావములకు భేదమున్నది-

నన్నెచోడకవి ఈభేదము నెఱిగినవాడు గావుననే—యిచట—దృక్సంగమ భావ లక్షణములను గ్రహించి, వానిని కేవలము వేఱ్వేఱుగా గాక—వాని నన్నిం టిని సమ్మేళనము చేసి—ఒక వెల్లువగా నిరూపించి—శివుని ముంచి యెత్తునట్లుచేసి ఆతడు పార్వతికి పూర్తిగా దేహముతో వశుడైనట్లు—మనకు ప్రత్యక్షము చేసి నాడు—ఇది కవితా శిల్పమున కొక కమనీ యోదాహరణము.

పైపద్య మాలంకారశాస్త్రము ననుసరించి "అనుభావము" అన్న రసధ్వనికి లక్ష్యము—

క. కారణమైన విభావము
చేర సముత్పన్నమైనఁ జెలఁగెడి దానం
భ్రారూఢ కటాక్షాదిక
మార యనను భావమయ్యెనది యెట్లన్నన్. (8—78)

(కావ్యాలంకార సంగ్రహము)

ఉద్దీపనాదివి భావములచే ఉదయించిన స్థితిని చూపులచేత నాయిక మనో భావమును వ్యక్తముచేయుట అనుభావము—

ఇచట పార్వతి చూపులచేతనే శివునిపై తనకు గలిగిన అనురాగమును అనుభవ గోచరము చేసినది—

ఇందు మనస్సుకన్న చూపులకే ప్రాధాన్యము—అందువలన నన్నెచోడకవి విశేషణములన్నియు చూపులకే వినియోగించినాడు—

ఈ పద్యము భవభూతి మాలతీమాధవములోని శ్లోకము ననుసరించినది నాయికయగు మాలతి నాయకుడగు మాధవుని చూచు ఘట్టమున నున్నది—

అలసవళిత ముగ్ధ స్నిగ్ధ నిష్పందమందై
రధిక వికసదంతర్విస్మయ స్మేరతారైః
హృదయ మశరణమ్మే పక్ష్మలాక్ష్యాః కటాక్షై
రపహృత మప విద్ధం పీతమున్మూలితంచ

గుఱినుండి మరలి, మరల దానియందు ప్రవర్తించినవియు ఆవ్యాజ భావము గలిగి, స్నేహముతో, గుఱినుండి యవ్వలికి దొలగనవియు, ఇటునటు కదలక—అధికముగా విస్తరిల్లుచున్న తన మనస్సులోనున్న విస్మయభావమును వికసించిన కనుగ్రుడ్డులు కలవియు, మిగుల దట్టములగు కనురెప్పలుగల (మాలతియొక్క) క్రీగంటి చూపులచేత, నా చిత్తము—హరింపబడినది. కొట్టబడి

నది; మూలము లేనిదిగా చేయబడినది. పై శ్లోకమున అనుభావమునకు లక్ష్యము లైన చూపులకు ఎనిమిది లక్షణములు గలవు.

క. గిరిసుత మై కామాగ్ని యు
హరుమై రోషాగ్ని యుందదంగజు మై ను
ద్ధుర కాలాగ్నియు రతి మై
యురు శోకాగ్నియును దగిలి యొక్కట నెగసెన్. 5–52

పార్వతి సేవకు రాగానే అప్పుడే తపోయోగము వడి కన్నులు తెఱచిన శివునికి పూలదండ నర్పించు నప్పుడు మన్మథుడదే సమయమని యాతనిపై తన బాణము ప్రయోగించెను. శివుని హృదయము చలించినది. తన మది చలనమునకు కారణమేమని నలువైపులు చూచినాడు-ఒక పొదరింటిలో దాగుకొన్న మన్మథుడు—అగుపడినాడు. తత్క్షణమే తన మూడవకన్ను తెఱచినాడు-ఏమున్నది? మన్మథుడు దగ్ధమగుచున్న మంటలు పైకిలేచినవి.

శివునకు మూడవకన్ను కూడా కలదు. అది అగ్నినేత్రము. తక్కిన రెండు చల్లదనము వర్షించిన మూడవది కాల్చివేయును. అ నేత్రాగ్ని స్వాభావికముగా మూడు రూపములు గలది.

ప్రాజాపత్యాగ్ని, ఆహవనీయాగ్ని, దక్షిణాగ్ని.

కాని మన్మథ దహనమున నది నాలుగు రూపముల నందినది-అక్కడ నున్నవారు నలుగురు-వారియందాయగ్ని యీ క్రిందిరీతిని పరిణమించినది-

| | |
|---|---|
| పార్వతీదేవియందు | కామాగ్ని |
| శివునియందు | రోషాగ్ని |
| మన్మథునియందు | కాలాగ్ని |
| రతీదేవియందు | శోకాగ్ని |

పద్యము చిన్నదియైన భావగంభీరమైనది, మన్మథుడు దగ్ధమైనను—పార్వతి మనసులో జీవించియే యున్నాడు—

ఆమె విరహాగ్ని ననుభవించినది. హరుని యందు రోషాగ్ని తాత్కాలికము అతడు వెంటనే మూడవ కన్ను మూసినాడు. తపశ్శాలులు తమ శక్తిని అదుపులోనుంచెదరు. మన్మథునికి కాలము ననుసరించి మరణము కలిగినది.

కాని కాలముననుసరించి అతడు తిరిగి జీవించును ఒకజీవి కాలవశమున మరణించినను అతడు మఱియొక గర్భమున ప్రవేశించి జనించుచున్నాడు. అను

నది భారతీయ సిద్ధాంతము, రతీదేవిది శోకాగ్ని-ఇప్పటికి కొడుకుచనిపోయినతల్లి "నాకు చిచ్చుపెట్టి పోయినాడు" అనును.

అట్టి మహోగ్రకోపదహనాంబకుఁ డట్టె దయాగుణంబుదాఁ
బుట్టి మనోజు నిచ్చునటె పోలదు నాజన దభ్రపంక్తిలోఁ
బుట్టె నిరమ్మదాగ్ని యును. భూరితరామృతవృష్టి దీని చొ
ప్పిట్టిదినాఁగ నెవ్వరికి నీశ్వరు తత్త్వమెఱుంగఁబోలునే. 5-97.

రతీదేవి తాను సహగమనము చేయు సందర్భమున ఆకాశవాణి పలికిన మాటలు.

మొదట ఆకాశవాణి శివుడు నీ భర్తను చంపినను ఆతడే తిరిగి నీ మగని నీకు నిచ్చును-అని పలికినది. కాని రతీదేవి నమ్మలేదు-అది గమనించి ఆకాశవాణి పైరీతిగా నిశ్చయముగా పలికినది.

ఉగ్రుడు, అగ్నిహోత్రమే కన్నుగాగల - ఆశివుడు, నాపైదయదలచి - నా ప్రియుని నాకిచ్చునా అనినీవు ఎంతమాత్రము సందేహింపవద్దు. మేఘములలో మెఱపుమెఱసినపుడు వేడిమిగల అగ్ని ఉదయించును-కాని ఆమేఘములే చల్లనైన - వానను ప్రసాదించునుగదా కాబట్టి నీమగడు జీవించును.

పై పద్యమున-అమృతవృష్టి-అను పదము-సార్థకము - ఈశ్వరునకు-అగ్నినేత్రమేకాక-సూర్యచంద్రనేత్రములుగలవు-అందు సూర్యుడు వేడి నిచ్చినను చంద్రుడు మాత్రము-అగ్ని, సూర్యులవేడిమిని ఉపసంహరింపజేయు, శీతలమునైన-వెన్నెల వర్షించును చంద్రునియందున్నది అమృతము-అది దేవతలకాహారము-శివుడే అమృతము వర్షించినపుడు నీమగడు జీవించియే యుండును-అనిధ్వని.

**దీనికి మూలము—**

"ఇతి చాహ స ధర్మయాచితః
స్మరశాపావధిదాం సరస్వతీమ్
అశనేరమృతస్యశోభయో
ర్వాశినశ్చాంబుధరాశ్చయోనయః. (4-43)

నన్నెచోడడిందు-సరస్వతీమూలమున మన్మధునికిగల బ్రహ్మశాప వృత్తాంతమును పరిహరించుట-ఆతనియౌచిత్యము ప్రకటించుటయేగాక. మూలమునకు-మెఱుగు పెట్టుచున్నది.

క. కరువునఁ బూరితమై లో
హరసములోఁగాలు నట్టులంగజశోకో
ద్ధురశిఖర లితను విమ్ముగఁ
గరఁగియు బొడవఱకలోన గాలుచునుండెన్. (5-99)

ఇందు మన్మథుడు దగ్ధమైనవెనుక-రతీదేవి జీవించియున్న స్థితివర్ణితము-ఆమెను-తనభర్తపోయినబాధ అగ్నిహోత్రమువలె - మనసులో దహింపజేయు చున్నదేకాని-శరీరమును మాత్రమట్లే నిలిపినది. మనసులో నట్లున్నను-ఆకారమున మార్పులేదు.

ఇచ్చట కవి-బంగారు ప్రతిమలను చేయు శాస్త్రీయ విధానమును తెలిపినాడు.

బంగారుతో ప్రతిమను దయారుచేయుటకు తొలుత - ఆ బంగారమును కరిగించి-మఱియొక లోహముచే చేయబడిన మూసలోపోసి-బొమ్మగా అచ్చులో రూపొందించెదరు-దీనినే కరువున బోయుటయందురు-మూసలో కరిగిన బంగారము కరుగుచునేయుండును కాని-మూసమాత్రము పైకి అట్లేయుండును.

పైపద్యమున రతీదేవి-మూసవంటి శరీరముతో లోన ఆమె కరువు-వలె-కరుగుచున్నది-అని ఉపమింపబడినది-కరువే బొమ్మయగునుగాన- ఆమెమూర్తీభవించిన శోకదేవతా స్వరూపముతో జీవకళ దక్కియున్నదనియు, శోకమాగి పోగానే తిరిగి యెప్పటివలె కలకలలాడు చుండుననియు గ్రహింపనగును ఇందు 'కరువు'- అను చిత్రకళసంప్రదాయము తెలుపబడినది.

చ. కలకల నవ్వునట్లు తమకంబునఁగన్గవ విచ్చి భ్రూలతల్
వొలయఁగఁ జూచునట్లు దనివోవఁగఁదెల్పియుఁ గౌఁగలింపఁ జే
తులు పచరించు నట్లదటుతో రతి కేళికి నుత్సహించున
ట్లెలమి నటించుచుండె సతి కీశ్వరు రూ పెదురం బ్రసన్నమై- (5-119)

పార్వతికి విరహతాపము గలిగినది, ఆమె తాపము నుపశమింప జేయుటకు చతురిక యను నామెచెలికత్తె శివుని రూపము ఒక చిత్రపటమున చిత్రించి ఆమె ముందర బెట్టెను. ఈశ్వర రూపము చిత్రపట రూపమున నెదురుగా నిలువగానే ఆమె శివుడు వాస్తవముగా తనయెదుట నిలిచిన భావమునే పొంది

"అతడు కలకల నవ్వినట్లు, తమకముతో కన్నులువిచ్చి చూచుచున్నట్లు, అత్యాసక్తితో ఆమెను కౌగిలించుటకు చేతులు చాపినట్లు, రతికి కేళికి నుత్సహించినట్లు," తన్మయత చెందినది ''

పై పద్యమున నాలంకారిక సిద్ధాంత మొకటి ప్రతిపాదింపబడినది. అలం కార శాస్త్రమున వ్యభిచారి భావములు అను భావ వ్యంగములు, చేష్టలను స్మరింప జేయును, అవి సజీవములు. ఇచట కదలిక, మెదలికలేని చిత్రరువును చూచి నపుడు వ్యభిచార భావము లెట్లుదయించును. అను సంశయము కలుగుట సహజము.

చిత్తరువున బొమ్మ కదలిక లేకున్నను. రంగుల మూలమున ఆ చిత్ర మున గల బొమ్మ అవయవ విన్యాసములు వ్యక్తములగుచున్న రీతుల వలన అవి జీవకళ గలిగి వ్యభిచార భావముల నుత్పన్నము చేయును.

చిత్తరువునకు జీవకళయే జీవము.

నన్నెచోడని రచనకానందించి దీనిని మేలుబంతిగా గొని పింగళి సూరన వ్రాసిన ఈ క్రింది పద్యము చూడుడు

చ. కలకల నవ్వినట్లు తెలికన్నుల నిక్కము చూచినట్లు తోఁ
   బలుక కడంగినట్లు పలుభావ గభీరత లబ్బినట్లు, పెం
   పొలయఁదనర్చి జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసియిచ్చెనా
   చెలువున కాభిముఖ్యము భజింపఁదలంకెను దానుబోటియున్

ప్రభావతీ ప్రద్యుమ్నము (1-188)

పై పద్యమున 'జీవకళ' స్పష్టము చేయ బడినది. చిత్రము సజీవము కాక పోయినను జీవకళ యున్నది. గావున రూపసౌష్టవము వలన, ముఖప్రసాదాదుల వలన మనోభావములు వ్యక్తములై రసానుభూతి కలిగించును.

దేవతా విగ్రహముఁతో బాటు దేవతా చిత్రములను మనము పూజించు చునే యున్నాము. వాని వలన మనకు రసానుభూతి కలుగుచునే యున్నది. ఇందువలననే చిత్రకళకు కావ్యమున స్థానమేర్పడినది.

ఆ వె. అలిగి మరునేర్చు హరుఁడు తానట్టిసాహ
   సాత్మునొద గూర్చి యీ యంబుజాక్షి నంత
   విరహ వేదనఁ బెట్టెడు విధిగడంగె
   ముసలి తాదండ గుండము ముంచున్నట్లు (5-143)

శివుడు మన్మథుని దహించి వైచినాడు, కాని తిరిగి ఆ మన్మథునే పార్వతికి తనయందత్యుత్కట మైన అనురాగము గలిగించి, విరహ వేదన పొందునట్లుగా చేసినాడు, ఇదియెట్లున్నదనగా ముసలిని గుండమున ముంచినట్లు న్నది. అని పద్యభావము.

శివుడు మన్మథుని శరీరమును దగ్ధముచేసినను, ఆతనిని పార్వతి మనస్సున జీవింప జేసియున్నాడు. కాని లోకమున కది తెలియదు, పార్వతి విరహవేదన పడుచున్నది. ఆ యవస్థను కవి ముసలి గుండమున మునిగినట్లు చమత్కరించినాడు.

పూర్వము కుమ్మరి గుండయ యను శివభక్తుడుండెడివాడు, భార్యతాను యువతీ యువకులు ఒకనాడాతడు వీథిలో పోవుచుండగా, మేడమీదనుండి ఒక ఆమె ఎంగిలి కంచము కడిగిన నీళ్లను పరాకుగా ఆతనిమీద పోసినది. వెంటనే క్రిందికి వచ్చి ఆతనిని తీసికొనిపోయి స్నానము చేయించి భోజనముపెట్టి తాంబూలమిచ్చి తను చేసిన తప్పిదము క్షమింపుడని వేడుకొన్నది.
ఆతడు తాంబూల చర్వణముతో ఇంటికి రాగానే భార్య "ఓహో! మీరొక వేశ్య యింటికివెళ్లి వచ్చు చున్నట్లుగావున్నారు. నన్ను తాకకుడు" అనిచెప్పి, భర్తతో కలియక వ్రతము పట్టినది. యౌవన వంతులు ముసలివారైనారు. పాపము వారు యౌవన మనుభవింపలేదు.

ఈశ్వరుడు, వారి దీక్షను మెచ్చుకొని ఆ ముసలి దంపతులను, ఒక గుండమున మునుగమని చెప్పి, వారినిద్దఱను పైకి లేవనెత్తెను వెంటనే వారిరువురు నవయౌవనులై విరహమనుభవించి నన్నాళ్లు సుఖించిరి.

శివుడుతొలుత వారికి మన్మథ బాధలేకుండ చేసియు తరువాత, వారిని తిరిగి మన్మథ వశాత్ములనుగా చేసినట్లు మొదట మన్మథుని దహించి, ఆవెనుక పార్వతికి విరహావస్థ కల్పించినాడు. అని సారాంశము.

క. పూవో పూవో యనిచే (34
రేచిన గందునని యోసరిల్లెదునామై
జీవంబు నిలుచునే నినుఁ
బోవిడిచి మహోగ్ర దుర్గముల పాల్పడ గన్ (6-12)

ఈ పద్యమున తల్లిప్రేమ వర్ణితము—

పార్వతి యేవనమున-దుర్గమమైన అడవిలో తపస్సు చేయుటకు వెళ్ల నిశ్చయించుకొన్నది. ఆమెను చూచి కన్నీరు పెట్టుకొనుచు తల్లియన్న మాటలు.

"నిన్ను పువ్వువలె- ఎంతో సుకుమారముగా పెంచుకుంటున్నాను— ఎప్పుడైన పొరపాటున నాచెయ్యి తగిలినట్లయితే-పూరేకువంటి అతి మృదువైన నీ శరీరము కందిపోతుందని-దానిని తప్పించుకొనే తిరుగుచున్నాను. ఇంక

నువ్వు- వెళ్ళిపోయినట్లయితే-నీమీదనే పంచప్రాణాలు నిల్పుకొన్న నేను జీవించి యుండగలనా ఉండలేను-అనిభావము.

పువుబోణి,పూవుంబోణి-అనునవి తెలుగునయువతికి పర్యాయపదములు.

స్త్రీ వర్ణనలో- పుష్పసదృశములు-సంబంధములు గలవు-

కన్నులు-తామర పూరేకులు-ముక్కు సంపెంగ పూవు= స్తనములు పూల చెండ్లు- మేను-లతాసదృశము

ఉ. ఈకల హంసి బెంపుమది నేమ అకివు మయూర పోతముం (85)
జేకొని పెంపు మీవుగన చిల్కల బెంపుము నీవు పెంపుమీ
కోకిల నీవు పెంపుమెల గోరట నీవెదమెచ్చ గొల్చియే
నా కలకంఠు దోడ్కొనిరయమ్మున వచ్చునంతకున్- (6-28)

పార్వతిదేవి-తపస్సు చేయుటకు వెళ్ళు సందర్భమున-తన చెలికత్తెలతో-తాను పెంచిన పక్షులను వారికప్పజెప్పి-వానిని పెంపుసేయమని- ఆజ్ఞచేసినది-తాను శివుని తోడ్కొని వచ్చు వరకును అట్లవారు చేయవలయునని కోరినది-ఈ పద్యమున భావము చమత్కారముగా కూర్చబడినది.

ఇందు కలకంఠ శబ్దముతో పాటు పక్షుల పేర్లను. భావధ్వనిగలవి-

కలహంసి - హంస - మధుర కంఠముగలది. మనోజ్ఞముగా మాటలాడునది

మయూరము-నెమలి= ,, ,, షడ్జమస్వరముగలది
చిలుక- — ,, ,, చక్కెరపలుకులవలె మాటలాడునది
కోకిల — ,, ,, తీయనైన పాట పాడునది.

పైవన్నియు- మధుర కంఠము గలవి- తీయనైనవి- ఆస్వాదనీయములైనవి=కాని వానితో ప్రస్తుతము పనిలేదు- వానిని మీరుంచుకొనుడు. నాకు కావలసది- తీపుకాదు—చేదు—

చేదు కంఠము కలవాడు కలకంఠుడు శివుడు - అతనినే తీసుకొని వచ్చెదను. శివుడు మధురాతి మధురమైన అమృతము విడిచి హాలహల సన్నిభ విషమును కంఠమున ధరించినాడు- అందుచేత నాతడు చేకుకుత్తుక వాడు-గరళకంఠుడు అయినాడు. అయినా అతడు నాకు కావలయును. శివుని సుఖము ననుభవింపకపోయినను శివుడే నా భర్త-అని ఆమె నిశ్చయమిందు ప్రదర్శితము

శా. ఆక్రొకార్కరను రాజు ప్రౌల నిజరా రావానంత గేయాభ్రవా
దై కాతోద్యముఁగూర్చి ప్రోయ సురగోపాం భోజరాగత్రిణా

నీ కోద్యద్దరి దళ్మక స్థల లసన్నృత్యోరు రంగస్థలిన్
గేకీ పాత్రములాలి యాడెనవి నుత్క్షిప్తా గ్రఫింఛంబులై 6.108

ఇది వర్షాకాల వర్ణన.

వర్షాకాలమున నెమళ్ళు తమ పింఛములను విప్పి నాట్యము చేయుటకవి సమయము. దానిని నన్నెచోడకవి నాట్యప్రదర్శనముగా నవ్యరీతిని సంతరించినాడు.

వర్షాకాలము అను రాజు ఎదుట. నెమళ్ళు పింఛములెత్తి ఆడుచున్నవి. నాట్యమునకు వాద్యము కావలెను. పెళపెళ గర్జించు మేఘధ్వనులే, వాద్యములు, ఇది నాద + ఏక + ఆతోద్యము. అను సమాసము మూలమున వ్యక్తము. ఆతోద్యమనగా వాద్యము, నాట్యము రంగస్థలమున ప్రదర్శింపబడును. ఆ స్థలమున, ఒక తివాసీ వేయబడును. ఇచట, వర్షము పడిన భూమియే రంగస్థలము, అందు వర్షము పడగానే చరించు సురగోపములు, అనగా ఆరుద్ర పురుగు లనుపద్మరాగమణులును, హరిదళ్మములు, పచ్చిక పట్టులను పచ్చరాళ్లును, దట్టముగా పడియుండుటచేత అది ఆకుపచ్చ, పద్మరాగములతో పొదుగబడిన తివాసీవలె నున్నది.

కేకీ పాత్రములన్నప్పుడు మనకు నాట్యకత్తెలు స్ఫురింపుదురు. పాత్రలనగా నాట్యకత్తెలు, పాత్ర శబ్దము నాట్యముచేయు స్త్రీలకు నాటకమునందలి పాత్రానువారికిని వర్తించును.

ఆముక్తమాల్యదలో రాయలు వర్షాకాల వర్ణనయందు పై నన్నెచోడుని పద్యము నిట్లనుకరించినాడు.

మ. అల పర్జన్యుడు కేకి పాత్రముల గుంపాడించుచో మేఘమం
దల పుష్కద్దెల గ్రుంగలేవను మరున్మార్దంగికుండర్థి నొ
త్తలవిన్ నేలకు వ్రాయుచున్నెగయుచున్ దారాడునత్తెల్ల జ
ల్లులు కెంగుచ్చులునయ్యె ధారలును తల్లోలేంద్ర గోపంబులున్ (4:92)

నన్నెచోడని పద్యమునకు మూలము వాల్మీకి రామాయణము.

"బాలేందు గోప్రాంతర చిత్రితేన
విభాతి భూమి ర్నవశాద్వలేన
గాత్రాను వృత్తేన శుక ప్రభేణ
నారీవలాక్షోక్షిత కంబలేన. —కిష్కిం. 28 స. 24 శ్లో॥

సురనది ఝషములు డిగ్గఁగ
శరనిధి కాశరధిలోని ఝషముల కెక్కన్
సురనది కిల్లెడపడకయ
కురిసె మహావృష్టి కుండ గూల్చిన భంగిన్ (6 . 104)

ఇది వర్షవర్ణన, వర్షపాత వేగ మిందద్భుతముగా వర్ణింపబడినది.

పైనుండి వర్షము పడునప్పుడాకాశగంగలోని చేపలు క్రింద సముద్రము లోనికి వచ్చుచున్నవి సముద్రములోనున్న చేపలు ఆకాశగంగలోని కెగిరి పడు చున్నవి. వర్షము పడుచున్నంతసేపు-చేపలు క్రిందినుండి మీది కెక్కుట మీది నుండి క్రిందికి దిగుట జరుగుచునే యున్నది - ఇది వర్షధారా వేగము మూల మున నేర్పడి యా వేగము సూచించును. వర్షధారవలన - భూమి ఆకాశము రెండును కలిసినవని ధ్వని.

ధారాపాతము — కుండ గూల్చుట.

ధారాపాతము - కుండ గూల్చిన రీతి నున్నది - అని నన్నెచోడడొక యుపమానము చెప్పినాడు. ఇచట కుండగూల్చుటేమియని సందేహము కలుగ వచ్చును - ఈ చిన్న వాక్యములో పూర్వము వర్షపాతమును కొలుచు పద్ధతి సూచితమైనది.

ఎంత వర్షము పడినది అను సంగతి తెలుసుకొనుటకు పూర్వము - అరువది మూడంగుళముల మూతిగల పెద్ద మట్టిపాత్రను - వర్షము వచ్చుటకు ముందు బయలున నుంచెదరు. వర్షము వెలిసిన వెనుక అది పూర్తిగా నిండిన నాలుగు తూములగును. దీనినే - ద్రోణమందురు - నాలుగు తూవ పట్టు కుండ యని యర్థము.

కుంభద్రోణముగాగ హర. 2.23.

"కుంభద్రోణముగాగ వాన గురిసెన్ ఘోరాంబుధారా కృతిన్-
"వైజయంతీ విలాసము" (8—44)

అనుచోట - పై పద్ధతి యే సూచితము.

వర్షవర్ణనలో పై పద్యమున కుండకూల్చుట యనగా, ఆ వర్షపాతము ఆ కుండ పర్ష ప్రమాణమును దాటి - ఆ కుండనే బ్రద్దలు చేయునంత జోరుగా పడినది— అని భావము.

ఈ వర్షమును గొలుచు పద్ధతి "సస్యానందము" అను గ్రంథమున నిట్లు చెప్పఁబడినది.

క. కొలువంగ నరువది మూడం
గుళములు ముఖ వృత్తమైన కుండను దైవ
జ్ఞులు బయల నిలిపి వర్షము
వెలసిన నవినలుతుమైన వెస ద్రోణమగున్

2 — ఆశ్వాసము.

(ముద్రిత గ్రంథమున కలశమని కలదు - అట్లయిన యతి తప్పును) అందుచే కుండ యని సవరింప బడినది. ఈ శాస్త్రీయ గ్రథమును తొలుత నీ గ్రంథ రచయితయే సాహిత్యలోకమునకు పరిచయము చేసినాడు.

"కుండ గూల్చిన భంగి, వారక వర్షంబు వఱుగొని గురియ" అని పాల్కురికి సోమనాథుడును వాడి యున్నాడు (పండితారాధ్య చరిత్ర. దీక్షా. పు. 146.

చ. ఉదుటఁ దెమల్చి మ్రింగు సరసోదక బిందుల మౌక్తికంబులం
గదఁ గబళించుఁ బీల్చు వడగండులకుం దనువోసరించు దో
యదము లదల్చి దూరు నచిరాంశు లతాగ్రములెక్కు మెల్పునం
బదలకు నుప్పరం బెగయు, జాతక పోతకముల్ సెలర్చుచున్

వర్షకాలమున చాతకముల వర్ణన — ఇందు కవికి చాతక పక్షులనుగూర్చిన సూక్ష్మ పరిజ్ఞానము - స్తవనీయము.

చాతక పక్షులు వాన నీటిని త్రాగును - అవి వాన వచ్చు కాలమున, మేఘములకై యెదురుచూచుచుండును. వాన పడగానే - అవి యెట్లు త్రాగినవో ఇందు వర్ణితము.

ఆకలిచేత — ఆ వానబిందువులను — కబళించుచున్నవి — నీటిని పీల్చుచున్నవి — మధ్యమధ్య వడగండ్లు పడుచున్నప్పుడు వానిని తప్పించుకొనుచున్నవి. మేఘములడ్డుపడిన వానిని త్రోసివేయుచున్నవి — మెఱుపులు మెఱిసినప్పుడు వానిపైకెక్కి ఆడుచున్నవి - మెఱుపులు తీగెవలెనుండును — మెఱుపుతీగె" అని వాడుక — కావున — చాతక పక్షి దాని యందాడుచున్నది - ఇది స్వాభావికమే - ఆ పైని చాతకములాకాశమున ఎంతో పైకి గూడ యెగురుచున్నవి.

ఇది యంతయు చాతక పక్షిజాతి సహజస్థితి - నన్నెచోడుడు నైపుణ్యముతో దీనిని సంతరించినాడు — వర్షకాలము - చాతకములు వర్ణించిన కవులున్నారు. కాని ఏకవియు పై రీతిని చాతక స్వభావము సరసముగావర్ణింపలేదు.

క. పరువడి కులగిరు లిడి వా
రిరుహో సనుఁడు గండరించెడ కో నాఁ
గర మమరి తత్పురంబున
నురుతర మణి హర్మ్యనికర మోలి వెలుఁగున్ (7-106)

హిమవంతుని రాజధానియగు ఓషధీప్రస్థపుర వర్ణన.

ఈ పురమున భవనము లెట్లున్నవనగా - బ్రహ్మ కుల-గిరులను -అనగా కుల పర్వతములను గండరించినట్లుగా నున్నవి - అని పద్యభావము.

ఇచట రాతితో భవనములను మలచుట చెప్పబడినది. ఇది యెంతయు స్వాభావికము. భవనములు కట్టుటకు రాయి ప్రధానము - అది పర్వతముల మూలమున విశేషముగా లభించును — ఇందు శిల్ప కళాసంకేతమగు గండరువు ప్రక్రియగా నుపయుక్తమైనది.

మ. కమనీయాత్మక సర్వలోహమణి సత్కాష్ఠేష్టికా నిర్మి తో
త్తమ హర్మ్యంబుల గండరించిన కపోత వ్రాత పంక్తుల్ బిడా
లములో లింగని వానిమీఁది కలుకన్ లంఘించి కాకున్నఁ ద
ద్భ్రమఁ బై నూఁగిన బల్కువొందెడగడీపారావ తానీకముర్ (7-111)

ఇది పురవర్ణనలోనిదే - అందలి రాజమందిరములలో గువ్వగూళ్లు నిర్మించి - అందలి కొణిగెల చూఱుల) మీద కొయ్యతో పావురములను చేసి (గండరించి) నిలిపినారు - అందు కొయ్యచే చేయబడిన పిల్లులు గలవు.

ఆ నెక్కిన కొయ్య పావురములను చూచి, నిజముగా అవి జీవించి యున్న పావురములే యని — పిల్లులు వాని పైకురికి, వానిని పట్టబోయి అవి కదలకపోయినందున చెవులు నిక్కబెట్టుకొని కొంచెము వెనుకకు సాగి నిలుచున్న పిల్లులవలె నున్నవి.

ఇచట పావురములు - పిల్లులు రెండును - కొయ్యతో చేయబడినవే — అయినను - అవి జీవకళతో నున్నవన్న భ్రాంతి కల్గించుచున్నది.

ఈ 112వ పద్యము — మాఘకవి శిశుపాలవధ నుండి గ్రహింపబడినది.

శ్లో॥ చిత్రకంసయా కృత్రిమ పత్త్రిపంక్తేః
కపోత పాళీషు నికేతనానామ్
మార్జార మవ్యాయత నిశ్చలాంగం
యస్యాం జనః కృత్రిమ మేవ మేనే శిశుపాలవధ (3-51)

నన్నెచోడని పద్యముపై శ్లోకమునకు తెలుగు.

గళనాదంబులు మంజుగానములుగాఁ గాంచీ లసత్కింకిణీ
కలనాదంబులు హృద్య వాద్యములుగా కాంతోరుపీ నోన్నత
స్థల రంగంబులుఁ గాముఁడన్నటకుఁ దోజం గూడ నాడింపగా
లలనా పాత్రములాడి గొప్ప రతిలీలా లాస్య లోలాస్యలై (8–180)

స్త్రీలు చేయు నృత్యము లాస్యమనబడును - ఇది సాధారణము వసంతోత్సవ సమయములందే చేయబడును.

లాస్యమునకు, సంగీతము, వాద్యములు — రంగస్థలముయుండవలెను.

నటకుడు పాత్రల నాడించును - ఆ పాత్రలు నాట్యకత్తెలు - వారు నాట్య విద్యాశిక్షణ బడసినవారు.

నన్నెచోడకవి పై పద్యమున - మన్మథునే నటకుడుగా చేసి - స్త్రీలనే లాస్యరంగమల పాత్రలుగా నిలిపినాడు.

సంగీతము — స్త్రీల మనోజ్ఞమైన కంఠధ్వనులు.
వాద్యములు - స్త్రీల యొడ్డాణమునకు కట్టుకొనిన గంటల ధ్వనులు.
రంగస్థలము - స్త్రీల వక్షోజములు

పై పద్యమున శాస్త్రీయ విషయము గలదు - నృత్తరత్నావళి యందు "మనసిజుని పునరపతరణోత్సవ సమయమునందలి వసంతోత్సవమును, అందలి వివిధ కార్యకలాపములను వర్ణించిన తొలికవి నన్నెచోడుడని చెప్పవచ్చును. (కుమారసంభవము (51–1 8)ఇందు నృత్యములోక భాగము" పుట అని పైపద ముదాహరింప బడినది." (పీఠిక-47)

వసంతోత్సవమున — వనితలచేత లాస్యము చేయించిన నన్నెచోడకవి-నృత్యరసజ్ఞత - నిరుపమానము.

నన్నెచోడడింతకుముందు వర్షవర్ణనలో నాట్యము వర్ణించినాడు - కాని అందలి పాత్రలు నెమళ్ళు - భూమి రంగస్థలము - మేఘ గర్జనలు వాద్యములు ఇట్లు నాట్య పరికరములన్నియు భిన్నములు.

పై పద్యమున నృత్యవర్ణన - యందు అందఋూ అందగత్తెలైన లలనలే లాస్యముచేయ నైపుణిగల వారని నన్నెచోడకవి వర్ణించుట లాలిత్య భావము స్ఫురింపజేయుచున్నది.

చ. అలఁతులు సిల్ప హస్తమున - హస్తవితానముతోఁ బెరంగఁ జూ
డ్కులు. తెలిచూడ్కులందెలమి గూడి రమింపనునంబు, తన్మనో
బలమున నుల్లసిల్ల నిజభావము, భావ విశేష సంపదల్
వెలయ రసంబు లందభినవించె రసంబులు సాంగికంబుగాన్ (9-36)

ఇది రంభ నృత్యవర్ణనము - అలప్తి - ఆలతి - రాగాలాపన హస్తములు విన్యాసముతో చూపులు కలిసినవి. చూపులతో మనస్సు లీనమైనది. మనస్సులోని భావములు - రసమును నుదయింద జేసినది. అని పద్యార్థము.

నన్నెచోడుడిట, నాట్యనృత్యములకు గల ఒక విశిష్ట భేదమును చక్కగా సూచించినాడు. ఇది భరతనాట్య శాస్త్ర సంబంధమైన గంభిర విషయము.

పై పద్యమునకు మూలము, నందికేశ్వరుని అభినయ దర్పణము నందిట్లున్నది.

యతో హస్త స్తతో దృష్టిర్యతో దృష్టి స్తతో మనః
యతో మన స్తతో భావో యతో భావ స్తతో రసః 37 శ్లో

నందికేశ్వరాది పూర్వ నాట్యాభినయ శాస్త్రకర్తలు నృత్యము రస భావ వ్యంజకమని నిర్వచింపగా - తర్వాతి వారైన ధనిక ధనంజయాదులు, నృత్యము రసహీనమైన భావవ్యంజక మే యని నిర్వచించిరి.

నన్నెచోడదు - నృత్యము రసభావ వ్యంజకమని చెప్పుటచే; నాతడు పూర్వ నాట్యశాస్త్ర కర్తలననుసరించి యుండుట గమనార్హము.

క. మదనోత్సవ మ్మధువమని
సదమల మతి బంధు జీవసంఘం బచిరా
స్పదమని యన్నిటినొక యలి
వదలి జపా సక్తినిలిచె వరముని వోలెన్ (9-103)

వనముతో చెలిక త్తెలతో గౌరీదేవి వచ్చినది, వసంతమున మదనోత్సవము ప్రారంభించినారు ఆ సమయమున వనవర్ణనలోనిది పై పద్యము.

అందు తక్కిన చెట్లతోపాటు, బంధుజీవములు, అనగా మంకెనపూవు చెట్లు, జపావతరులు, అనగా దాసనపు పూల చెట్లుకలవు. ఆ సమయమున, ఒక తుమ్మెద దాసనపు పువ్వుపై నిలిచినది. తుమ్మెద పూవునందు నిల్చుట సహజమే. కాని కవి యిట్లు దానినిట్లు చమత్కరించినాడు. ఇచటను శబ్దశ్లేషయే.

మీరు మదనోత్సవము - మన్మథోత్సవము, కాముని పండుగ చేయు చున్నారు గాని, అది చిరకాలము జరుగదు. అస్థిరము ఆక, బంధుజీవములు, మీ చుట్టపక్కములు, మీ సంబంధులందఱును మరణించవలసిన వారే, వారును శాశ్వతముగా నుండరు. ఇట్లు చంచలములైన వానిని విడిచి, అచలమైన-ఆత్మా నందము పొందవలెను. అదియే ముక్తి. అది జపమువలన సిద్ధించును. అని ఒక తుమ్మెద, జపాతరువు (వాసనపుచెట్టు) మీద నిలిచినది. అని కవి హితబోధ.

దీనికి "మదనమన లోక్య నిష్ఫల
మసత్యాశాబంధు జీవమ్ కుసుమానామ్
వన ముపగమ్య భ్రమరః
జాతస్సంప్రతి జపాసక్తః" అను మూలము గలదు.

వసంతమున, మదనోత్సవము చేయుట చాలా ప్రాచీనమైన సంప్రదాయము
"సువసంతో మదనోత్సవః తత నృత్యగీత వాద్యప్రాయః
క్రీడాః. ఏతా అపిమాన్య క్రీడాః"
వాత్స్యాయన కామ సూత్రములు
నాగరక వృత్తము. 1-4-42 జయమంగళ వ్యాఖ్య.

క. ఉరుతర తనుఁడగు కద్బుట
వరునట్ట నిఖంబు శిరము వడినదికి బలో
త్కరమునఁ బ్రతి వీరభయం
కరుఁడై యుద్ధంబు చేసెగణపతివోలెన్ (11-179)

యుద్ధములో ఒకచోట, ఒక స్థూలకాయుడగు భటుని మొండెము పడి యున్నది. మఱియొకచోట, ఒకయేనుగు తలపడి యున్నది, అప్పుడక్కడి బంటొకడు, ఆ మనిషి మొండెమునకు ఏనుగుతల నతికినాడు, తల అతుకగానే అతడు లేచి గణపతివలె యుద్ధము చేసినాడు.

ఇచ్చటనొక చమత్కారమున్నది. నరునకు వానరమునకు, కుంజరము నకు, అనగా మనుష్యునికి. కోతికి, ఏనుగునకు మస్తిష్కమొక్కటే, వానికి తలలు సమానము. అందువలన తలలేని మనిషికి ఏనుగుతల నతికిన, ఆ మనిషి మనిషివలె యుద్ధము చేయునని తలచి, ఆ భటుశట్లతికినాడు, కాని ఏనుగు తల

అతికినంత మాత్రముచేత, అతడు మనిషివలె యుద్ధము చేయలేడు. అది అసంభవము. ఇక్కడ గణపతివలె, యుద్ధము చేయుట చిత్రము! ఇంతకు ఏనుగుతల గల మానవస్వరూపము మనకు పురాణములయందు కనుపడినది. గణపతి స్వరూపమొక్కటే

గణ శబ్దమునకు సేనాసమూహము అని యర్థము కలదు (అమర కోశము పుట ౯౧). దానిని పురస్కరించుకొని నన్నెచోడడు. గణపతి సేనా నాయకుడుగా నిరూపించినాడు. కాని గణపతి శబ్దమునకు వ్యుత్పత్తి వేఱు.

గణానాం ప్రమథాదీనా మధిపో గణాధిపః ప్రమథాది గణములకు నాయ కుడు (అమరకోశము ౪౭పుట).

ఇందువలన గణపతి సేనా నాయకత్వము నన్నెచోడని నవీన కల్పన.

౪. దురమున నెడద దొడ మొల
కరిశిరముర మక్కు ప్రక్క బడుమములుంగె
డ్పెరసై యేర్పడ కతి లీ
కర మయ్యె యముడు కుడిచి క్రక్కిన భంగిన్ (11–194)

యుద్ధరంగమున, శరీరావయవములన్నియు ముక్కలు ముక్కలుగా ఖండితములై, ఇది మెడ, ఇది తల, ఇది మొల, ఇవి చేతులు, ఇవికాళ్లు, అని ఏర్పఱచడానికి వీలులేకుండా కలగాపులగముగా పడియున్నవి,

ఇది భీభత్స రసమును వ్యక్తము చేయుచున్నది. అయినను, నన్నెచోడ కవి యిందును చమత్కారముక పలికినాడు.

యుద్ధమున మరణించిన వారందఱు యమలోకమునకు పోవుట. యిందు యముడు తన లోకమునకు వచ్చిన వారందఱిని మింగుచున్నట్లును, మ్రింగిన ఆహారము జీర్ణించుకొనలేక, అతడు వానిని క్రక్కివేసినట్లు కవి వర్ణించినాడు. ఇది సహజమే మనకాహారము జీర్ణము కానప్పుడు. మ్రింగిన ఆహారము, ఎట్లు మ్రింగినామో, ఆ స్వరూపముతో వమనము (క్రక్కు) మూలముగా పైకి వచ్చును.

నన్నెచోడకవి అవయవములు ఖండితములై చెల్లాచెదురుగా యుద్ధరంగ మున పడియున్నప్పుడు. యుద్ధరంగము, యముని యింటి వంటశాలగా నున్న

ట్లును, అందు ఖండితావయవములు వండడానికి తరిగిన కూరముక్కలవలె నున్నట్లును వర్ణించినాడు. (11-193)

చ కడితలవారు వ్రేయఁ గడి ఖండములై పడి వండదర్గిన
ట్లడ గొనియుండె...రణభూమి కృతాంతకు బానసంబునాన్
తిక్కన దీనిననుసరించాడు.

సీ. అవయవభేదంబుల దురక తునియలై
యున్న గాత్రంబు లొకొక్కచోట
గీ. కల్పాంతమున జము బానసంబు
నింటిలోపల బోలె నొప్పెసఁగఁజూడ (నిర్వ 4-1)

సీ. కమలజు పాశంబు గాలాపు త్రాడుగా
కాలోగ్ర దండంబు గడయు గాఁగ
దనుజారి చక్రంబు గొనివచ్చి గాలంబు
గా పవమాను మృగంబు కొమ్ము
బలు విడిగొని ధాత్రి బాతశమున బడఁ
గ్రొచ్చి నాగేంద్రుని దెచ్చి తలలు
సిదిమి యందెఱగ్రుచ్చి యుదధిలోపల వైచి
మహదాది మత్స్య కూర్మములఁ దిగిచి

ఆ వె. హరు లలాటాగ్ని లోపల నెఱియబెట్టి
నమలు నిజభుజ భూరి విక్రమము మెఱయ
వాని బలు విడి సీవెర్గవేని కాని
తారకాసురు నెఱుగ రె వీరు దొల్లి (11-171)

ఇది తారకాసురుని పరాక్రమమును వర్ణించు పద్యము. ఇందులో వీర రసమే కాక, కవి లోకజ్ఞతయు ప్రదర్శితమగుచున్నది.

జాలరి సముద్రములోని చేపలను గడకు చివర త్రాడుతో గాలమునకు గట్టి ఎఱబెట్టి చేపలను బట్టి, వానిని గ్రహించి, అవి నిప్పులోవేసి, వానిని ఆహారముగా నమలి మ్రింగును.

తారకాసురుడట్లే అష్ట దిక్పాలకుల దఱిని జయించి ఏ విధముగా వారిని వశపఱచుకొనినాడో అద్భుతముగా వర్ణితమైనది. తారకాసురుడు వరుణుని

పాశములు తీసికొని అవి గాలాపు త్రాడుగాను యముని దండము గడగాను చేసినాడు. విష్ణువు చక్రము గాలము. వాయువుకు వాహనమైన, లేడి కొమ్మును తీసికొని, దానిని పాతాళమున బడవైచి, అందు నివసించుచున్న నాగేంద్రుని తలలు చిదిమి, వానిని గాలమున కెఱగా చేసి— సముద్రములో వేసినాడు- ఆ గాలమునకు పెద్దపెద్ద మత్స్యములు, చేపలు, కూర్మములు, తాబేళ్లు చిక్కుకొనినవి. ఇచ్చట మత్స్యములు, కూర్మములు, అనగా, విష్ణువు మత్స్యావతార కూర్మావతారములు సూచితములని గ్రహింప వలెను.

అట్లు లభించిన చేపలను తాబేళ్లను ఈశ్వరుని మూడవ నేత్రమందలి అగ్నిలో కాల్చి, తారకాసుడు, నమిలి మింగును.

ఇందు జాలరివాని, సాధనములను, పౌరాణిక దేవతలఆయుధములనుగా నిరూపించుట, నన్నెచోడని కావ్య కళానై పుణ్యమున కొక మచ్చుతునక.

నీతండ్రి అగ్నినేత్రమునుపయోగించి, అతని వశపఱచుకొన్న నాపై అతని కుమారుడు దండెత్తిన నేమగునో తెలిసికొనుడు, అని ధ్వని.






# మీ ఆత్మీయులతో ఆనందం పంచుకోండి
# ఒక్క రూపాయికే నందిని నందుకోండి

కేవలం ఒక్క రూపాయితో – భారత దేశంలో మీ ఆత్మీయులు ఎక్కడున్నాసరే – సంవత్సరం పాటు వాళ్ళు మిమ్మల్ని గుర్తుంచుకునేలా – మీ ఆత్మీయతకు కొత్త అనుబంధాన్ని పెనవేస్తూ – యువభారతిని వారికి పరిచయం చేసినందుకు మిమ్మల్ని అభినందించేలా చేస్తూ – పన్నెండు నెలలూ మీ ఆత్మీయుల్ని పలకరిస్తుంది 'నందిని' అటు అందుకున్నవారికి ఆనందాన్నీ, ఇటు అందిస్తున్న మీకు సంతృప్తినీ సమానంగా పంచిపెడ్తుంది – 'నందిని'

## మీరు ఎన్నైనా రూపాయలు పంపవచ్చు
## అన్ని చిరునామాలూ పంపాలని గుర్తుంచుకోండి!

ఉత్తర ప్రత్యుత్తరాలకు –

**యువభారతి**

5 కింగ్స్‌వే, సికిందరాబాదు, 500003

స్వయంగా వచ్చి కలవదలిస్తే : యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనాలు,
తిలక్ రోడ్డు, హైదరాబాదు, 500001



చుట్టూరా
ఆవరించుకునివున్న చీకటిని
తిట్టుకుంటూ కూర్చోవడంకంటె
ప్రయత్నించి
ఎంత చిన్నదీపాన్నయినా
వెలిగించడం మంచిది



అన్నవాక్యమే మా యువభారతికి ఊపిరి